# ఇదిగో వీరే విజేతలు!

## చందమామ

### మనసంస్కృతిని తెలుసుకోండి పోటీ

'మన సంస్కృతిని తెలుసుకోండి'
పోటీ ఫలితాలను ప్రకటించడానికి మేము ఆనందిస్తున్నాము!
విజయం సాధించాలనే లక్ష్యంతో ఎంతో ఉత్సాహంతో
ఎందరో పోటీలో పాల్గొన్నారు! విజేతలకు అభినందనలు!

## అద్భుతమైన మొదటి బహుమతి విజేత

## అనుపమ్ ఫుకన్

ఉషాపూర్ మోరన్‌హాట్ పి.ఓ. మోరన్‌హాట్
సిబ్‌సాగర్ జిల్లా, అస్సామ్-785 670

అన్ని ఖర్చులు మేము భరించగా విజేత ఇండియా పనోరమా పర్యటన ప్రారంభిస్తారు.
జయప్రదంగా పర్యటించాలని శుభాకాంక్షలు!

## తెలుగు భాషలో రెండవ బహుమతి విజేతలు

**కాళహస్తి నాగేశ్వరరావు, ఉండ్రావరం ■ పి. వి. సుమతి, విజయనగరం ■ మహమ్మద్ రజియా,** గుంటూరు. ■ నందుల సుభద్ర, విశాఖపట్నం. ■ జె. మహంకాళి, చీరాల. ■ షఫీయుల్లా, ఏలూరు. ■ డి. తారకేశ్వరీదేవి, మచిలీపట్నం. ■ యం. లత, హైద్రాబాద్. ■ అయితా సత్యనారాయణ, సూళ్ళూరుపేట. ■ కె. జ్వాలా శరశ్చంద్ర, ఒంగోలు.

ఇవికాక మూడవ, కన్సొలేషన్ మరియు స్పాట్ బహుమతులు నెగ్గిన 2700 మంది వున్నారు. మీకు బహుమతి లభించివుంటే, ఆ విషయాన్ని మేము పోస్ట్‌ద్వారా మీకు తెలియచేస్తాము. మీకు ఆ విధంగా మేము అందచేసే వాటినుంచి మీరు మీ బహుమతిని ఎంపిక చేసుకోడానికి అవకాశం లభిస్తుంది.

ఈ పోటీ ఎంతో విజయవంతమైంది. మీరు పాల్గొన్నందుకు కృతజ్ఞత తెలియచేస్తున్నాము.

ఈసారి పోటీలో విజయం లభించనివారు నిరాశ చెందక్కరలేదు. మరో అవకాశంఎప్పుడూ వుంటుంది.

ప్రవేశ రుసుము లేదు



# చందమామ కేమెల్
## రంగుల పోటీ

**బహుమతులు గెలవండి**

**కేమెల్**

1 ప్రథమ బహుమతి రూ. 15/-
3 రెండవ బహుమతి రూ. 10/-
10 మూడవ బహుమతి రూ. 5/-
10 సర్టిఫికెట్లు

ఈ పోటీలో 12 సంవత్సరాల లోపల వయస్సు కల పిల్లలు పాల్గొనవచ్చు.

పైన చూపించబడిన చిత్రాన్ని <u>పూర్తిగా</u> కేమెల్ రంగులతో నింపి దిగువ చిరునామాకు పంపండి:

పో. బా. నం. 9928 కొలాబా, బొంబాయి-400 005.

న్యాయనిర్ణేతలదే చివరి నిర్ణయం. దీనికి అందరూ కట్టుబడాలి. ఈ సంబంధంగా ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.

Name:........................................................................Age:....................

Address:......................................................................................

...............................................................................................

ఈ తేదీ లోపల ఎంట్రీలను పంపండి: *30—11—1983*

**CONTEST NO33**

ముక్కలు పెట్టిన గీత వెంట కత్తిరించండి.



**Results of Chandamama—Camlin Colouring Contest No.31 (Telugu)**

*1st Prize:* E. Prabhakar, Jandur. *2nd Prize:* T.S.V. Ramesh, Hyderabad-500 001. Anil Prabhukumar, Yammiganeer. R. Ram Mohan, Siddipet. *3rd Prize:* P. Varaprasad Kumar, Kokinada-533 001. G. Sangeetha, Kamalapuram. Pusuluri Sarvaswara Phani, Rajohmundry. Palivela Bhushana Rao, Kakinada-535 004. T. Sunita Devi, Hyderabad. P. Rajeshwari, Bangalore-560 038. B. H. Rajashree, Anantapur. V. Manga Raju, Vijayawada-6. K. Srinath, Hyderabad-48. Md. Hussain Khan, Hyderabad-35.

# మాల్టోవా ముఠా—
# వాళ్ళు ఎప్పుడేం చేస్తారో తెలియదింక !



మాల్టోవా తాగే పిల్లలంటే యిక చెప్పాలా! జీవితంలో ఆనందాన్ని సంపూర్తిగా, జుర్రుకుంటారు—స్కూల్లోనేం, ఆటల్లోనేం. మంచితనం నిండుగా ఉన్న మాల్టోవా పిల్లలకెంతో హితకరమైనదేకాక, పాలను మంచి రుచికరమైన పానీయంలా మార్చివేస్తుంది కూడా!

**ప్రకృతి ఒడిలో పండిన గోధుమలు బార్లీల మాల్టు**

పంజాబులో పండిన గోధుమలు, బార్లీ, మాల్టోవా ప్లాంటులో పుష్టికరమైన మాల్టుగా మారిపోతాయి. ముఖ్యమైన ఖనిజాలు, విటమిన్-B తోటి మాల్టోవా సత్వరం శరీరంలో ఇమిడిపోయే జీర్ణీకృతాహారం.



**శుద్ధమైన, హితకరమైన పాలు**

మా స్వంత పాల సేకరణ కేంద్రాలద్వారా వస్తాయి, మాల్టోవాలో చేరే పాలు. ఇవి సదా నూటికి నూరుపాళ్లు శుద్ధమైనవి, నూరుపాళ్లు పుష్టికరమైనవి.

**నోరూరించే కోకో రుచి**

మేలైన విదేశీ కోకోన్నే మేము వాడుతాము. లేకపోతే మరి మీకు మంచి రుచి, మంచి పుష్టి ఎలా దొరుకుతాయి? కోకోతో కొత్త జీవం వస్తుంది. సేద తీరి విశ్రాంతికి దోహదమవుతుంది.



**శక్తికోసం చక్కెర**

ఏరి కోరి ఎన్నుకున్న శుద్ధమైన, తెల్లటి పంచదార. పిల్లలకవసరమైన ఆ అదనపు శక్తికోసం అతి ముఖ్యమైనది.

**విటమిన్లతో ప్రత్యేకించి పటిష్ఠం చేయబడింది**

ప్రోటీన్లు, కార్బోహైడ్రేట్లు, విటమిన్లు, ఖనిజాల అద్వితీయ సమ్మేళనం మాల్టోవా. ఇది అదనపు విటమిన్-A, నియాసిన్, విటమిన్-$B_1$ విటమిన్-$D_2$ లతో కూడా పటిష్ఠం చేయబడింది. కృత్రిమ సువాసనలిందులో లేవు.






**JIL** జగత్‌జిత్ ఇండస్ట్రీస్ లిమిటెడ్

1981, 1982లో మాండే (ప్రపంచ) ఎంపికలో బంగారు పతకాల విజేతలు

## విటమిన్‌లతో నిండిన మాల్టోవా: ఆరోగ్యం, బలం మరియు శక్తికోసం

SIMOES/JIL/1/83 TL

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

చాలాకాలం తరవాత, ఈ దీపావళి సందర్భంగా, ''చందమామ''ను ఎక్కువ పేజీలతో ప్రత్యేక సంచికగా ప్రచురిస్తున్నాం. ఇది మాతోపాటు పాఠకులకు కూడా సంతోషకారణం అవుతుందని భావిస్తాం.

ఈ నెల బేతాళకథ [''శక్తిలేని రాక్షసుడు'']కు ఆధారం ''వసుంధర'' రచన.

## అమరవాణి

జీవన గ్రహణే నమ్రాః, గృహీత్వా పున రున్నతాః,
కిం కనిష్ఠాః కిము జ్యేష్ఠాః, ఘటీయంత్రస్య దుర్జనాః.

[దుష్టులు బతుకుతెరువుకోసం మొదట ఎంతో వంగి వుండి, అది తీరగానే విర్రవీగుతారు. ఏతాము నీళ్ళకోసం బావిలో వంగి, తరవాత నిటారుగా లేచి నిలబడుతుంది. దుష్టులు దానికి అన్నలో, తమ్ములో అవుతారు.]

సంపుటి 73 నవంబర్ '83 సంచిక 5
విడి ప్రతి : 2–50 : : సంవత్సర చందా : 24–00



## చందమామ కబుర్లు



### 'గీతాంజలి' గీతాలు

మీరట్‌లో 1961 వ సంవత్సరం జన్మించిన గీతాంజలి పట్టుమని పదహారేళ్ళు నిండకముందే క్యాన్సర్ వ్యాధికి బలియైపోయింది. కొన్నాళ్ళ తరవాత గీతాంజలి పడక కింద ఆమె రాసిన కొన్ని గీతాలు ఆమె తల్లికి లభించాయి. "పిడుగులు విరిసే మెరుపులతో, నా దారి వెలిగిపోతుంది" లాంటి సున్నితమైన భావాలతో నిండిన చిన్నారి గీతాంజలి గీతాలను ఇంగ్లండ్‌లోని ఓరియల్ ప్రెస్, ప్రీతీష్‌నంది పరిచయ వాక్యాలతో ప్రచురించింది.

### ఆధునిక 'అజ్ఞానం'




విజ్ఞానం వెలుగులో రోజు, రోజుకీ మనిషే మనిషికి గొయ్యి తవ్వు తున్నాడు. 1945వ సంవత్సరంలో ప్రయోగించిన అణుబాంబు హిరోషిమాను సర్వనాశనం చేసింది. ప్రస్తుతం ప్రపంచంలో పేరుకుపోయిన అణుబాంబులను, హిరోషిమా అణుబాంబు పరిమాణంలో విభజించి ప్రయోగిస్తే – నిమిషానికి ఒక బాంబు ప్రకారం ఎడతెరపిలేకుండా రెండేళ్ళు రాగలవట! అణుయుద్ధంవల్ల, వైద్య విజ్ఞాన, వాతావరణ రంగాల్లో ముంచుకురానున్న దుష్ఫలితాలను గురించి ఊహించలేని అజ్ఞానంలోనే అన్ని ప్రభుత్వాలూ వున్నాయి— అంటాడు ప్రముఖ విజానవేత్త డాక్టర్ హెలెన్ కోల్డికాట్!

### పరుగు పందెంలో మొనగాళ్ళు!



కెన్యాకు చెందిన మైక్ బాయిట్ మైలు దూరాన్ని మూడు నిమిషాల ఇరవై ఎనిమిది సెకండ్లలో పరుగెత్తి, పరుగు పందెంలో సరికొత్త రికార్డు సృష్టించాడు. ఆక్‌లాండ్‌లో జరిగిన ఈ దిగుడుదారి పరుగు పందెంలో మరో సెకండు అదనంగా తీసుకుని, అమెరికాకు చెందిన స్టీవ్ స్కాట్ రెండవస్థానాన్ని పొందాడు.

## మీకు తెలుసా?

1. మానవశరీరంలోని రక్తనాళాలను, ఒకదాని వెనుక ఒకటి పొడవుగా అమర్చినట్టయితే, ఎంత దూరం ఉంటుందో ఊహించగలరా?
2. మానవనేత్రం ఎన్ని రంగులను గుర్తించ గలదో మీకు తెలుసా?
3. మనిషి ఎన్ని రకాల వాసనలను గుర్తించ గలడు?
4. ప్రపంచంలో అధికమైన పదజాలం గల భాష ఏది?
5. ఒకే సమయంలో ఒక చేత్తో రాస్తూ, మరో చేత్తో చిత్రాలు వేసిన మేధావి ఎవరు?

(సమాధానాలు 80వ పేజీలో)



# అపురూప వజ్రాలు

మణిభద్రు డనే వర్తకుడు దేశదేశాల్లో వ్యాపారం చేస్తూ, చివరకు అవంతీ రాజ్యం చేరుకున్నాడు. అతడు వజ్రాల వర్తకుడు. అవంతీ రాజ్యం చేరేసరికి అతడి వద్ద, ఒకే ఒక విలువైన వజ్రం తప్ప, తతిమ్మావన్నీ నాసిరకం వజ్రాలు మిగిలాయి. ఆ విలువైన వజ్రం చాలా అపురూపమైనదనీ, దాన్ని ధరించిన వారి భవిష్యత్తు గొప్పగా వుండబోతుందనీ, మణిభద్రుడు చెబుతూండేవాడు.

అవంతీ రాజుకు యీ సంగతి తెలిసి, మణిభద్రుణ్ణి పిలిపించి, "నీ వద్ద అపురూపమైన వజ్రం వున్నప్పుడు, మొదట మాకు చూపించవలసివున్నది. పదిమందికీ దాన్ని గురించి చెప్పి అమ్మ జూపావు. నీ సంజాయిషీ ఏమిటి?" అన్నాడు.

రాజు యిలా అనగానే మణిభద్రుడు తెల్లబోయాడు. అంతకు ఒక గంట ముందు, అవంతీ సైన్యాధ్యక్షుడు అతడికి కబురుచేసి, ఆ అపురూపమైన వజ్రం తనకే అమ్మవలసి వుంటుందని బెదిరించాడు. కాని, అతడు దానికి తగిన వెల చెల్లిస్తాడన్న నమ్మకంలేదు.

మణిభద్రుడు ఎంతో వినయంగా రాజుతో, "మహాప్రభూ, నేను అవంతీ దేశంలో పుట్టి పెరిగినవాణ్ణే. కొన్నేళ్ళ క్రితం, వ్యాపారం మీద యితర దేశాలకు పోయి, తిరిగి స్వదేశం చేరాను. తమను కలుసుకుందామనుకుంటూండగానే, తమ వద్ద నుంచి కబురు వచ్చింది," అన్నాడు.

అవంతీరాజు సగర్వంగా మీసం దువ్వుకుని, "మా కోసం అపూర్వవజ్రాన్ని వెంట తెచ్చేవుంటావు!" అన్నాడు.

మణిభద్రుడు ఎంతో సమయస్ఫూర్తిగా, "వజ్రం తేలేదు. తమ ఆజ్ఞ విని కంగారుగా వచ్చేశాను," అన్నాడు.

ఎమ్. వి. వి. సత్యనారాయణ



"అయితే, ఇంటికి పోయి వజ్రం తీసుకురా," అన్నాడు రాజు.

మణిభద్రుడు బతుకుజీవుడా అనుకుంటూ, రాజు దగ్గిరనుంచి బయలుదేరాడు. రాజప్రాసాదం దాటకుండానే, అవంతీ మంత్రి అతడికి ఎదురువచ్చి, "నువు రాజుగారికి ఎలాంటి వజ్రం యిస్తావో, నాకు తెలియదు. అపురూప వజ్రాన్ని మాత్రం, నాకే యివ్వాలి. అలా చెయ్యకపోయావో, నువ్వు యీ రాజ్యంలో వుండకుండా చేయగలను," అన్నాడు.

మణిభద్రుడు అయోమయంలో పడ్డాడు. సైన్యాధ్యక్షుడు బలప్రయోగంతో, రాజు అధికార మదంతో, మంత్రి తెలివితేటలున్న గర్వంతో, తన దగ్గిరున్న వజ్రాన్ని తమ సొంతం చేసుకోవాలని చూస్తున్నారు. తాను, యీ ముగ్గురి బారి నుంచీ తప్పించుకోవడం ఎలా?

మంత్రికి సమయానికి ఏదో సర్ది చెప్పి, ఇంటికి వెళ్ళాడు మణిభద్రుడు. తరవాత ఒక వారం రోజుల వరకూ మణిభద్రుడు రాజుకుగానీ, మంత్రికిగానీ, సైన్యాధ్యక్షుడికిగానీ కనిపించలేదు.

ఆ మర్నాడు రాజు పంపిన గూఢచారులు అతణ్ణి రాజు వద్దకు తీసుకుపోయారు. రాజు, మణిభద్రుణ్ణి కోపంగా పలకరించాడు. అతడు మౌనంగా రాజుకు ఒక ఉంగరం యిచ్చాడు. దానిలో ధగధగలాడే వజ్రం పొదిగివున్నది.

ఒక్క క్షణం రాజు ముఖంలో ఆనందం కనబడింది. కాని, ఆ మరుక్షణం ఆయన పెదాలు గట్టిగా బిగించి, "ఇది నిజంగా అపురూప వజ్రమేనా?" అని అడిగాడు.

మణిభద్రుడు అవునన్నట్టు తల వూపాడు. రాజు అతడికి ఏవో చిన్న కానుకలిచ్చి పంపేశాడు. దారిలో మంత్రి అతడి కోసం కాచుకుని వున్నాడు.

"అయ్యా, తమ వద్దకు నేనే రావాలనుకున్నాను," అని, మణిభద్రుడు దుస్తుల్లోంచి ఒక ఉంగరం తీసి ఆయనకిచ్చాడు.

ఆ ఉంగరంలో కూడా ఒక వజ్రం పొదిగివున్నది!.

మంత్రి దానివంక అనుమానంగా చూస్తూ, "అసలు వజ్రం ఉంగరంలో పొదిగి రాజుగారి కిచ్చావు. ఈ వజ్రం ఏదో తక్కువ విలువకలదైవుంటుంది. అపురూపవజ్రం కాదు," అన్నాడు.

మణిభద్రుడు ఆ మాటలకు నొచ్చుకుంటున్నట్టు ముఖం పెట్టి, "అయ్యా, ఈ వజ్రమే అపురూప వజ్రం! కావాలంటే, ఎవరైనా వజ్రనిపుణుడికి చూపించండి," అన్నాడు.

ఆ జవాబుతో మంత్రికి నమ్మకం కుదిరింది. ఉంగరం తీసుకుని, తోచిన బహుమతేదో యిచ్చి పంపేశాడు.

మణిభద్రుడు ఇంటికి వెళ్ళేసరికి, అక్కడ సైన్యాధ్యక్షుడు కాచుకూర్చుని వున్నాడు. రాజుకూ, మంత్రికీ యిచ్చినట్టే, అతడికీ ఒక ఉంగరం యిచ్చాడు మణిభద్రుడు.

ఈ విధంగా కొద్ది రోజులపాటు, ఆ ముగ్గురి నుంచీ ప్రమాదం తప్పినట్టయింది, మణిభద్రుడికి. అయితే, ఆ సంతోషం ఎంతో కాలం నిలవలేదు. రాజూ, మంత్రీ, సైన్యాధ్యక్షుడూ ఒక విందు సమయంలో వజ్రపుటుంగరాలు ధరించి కలుసుకున్నారు.



మాటల సందర్భంలో వాళ్ళ దగ్గిర వున్న వజ్రాల్లో, ఏది అపురూపమైనదన్న తర్కం బయలుదేరింది. ముగ్గురూ కలిసి మణిభద్రుణ్ణి రప్పించుకున్నారు.

"నీ దగ్గిర వున్నది, ఒకేఒక అపురూప వజ్రం కదా? మా ముగ్గురికీ, అపురూప వజ్రాలు పొదిగిన ఉంగరాలిచ్చావు. ఈ మూడింటిలో, అపురూప వజ్రం పొదిగిన ఉంగరం ఏది?" అని అడిగాడు రాజు.

మణిభద్రుడు యిరుకున పడ్డాడు. అయినా అతడు వెంటనే తేరుకుని, "ప్రభూ, అధికారమూ, తెలివితేటలూ, బలపరాక్రమాలూ వున్న మీ ముగ్గురితోనూ వెటకారం ఆడే ధైర్యం, నా

కుంటుందా? మూడూ అపురూప వజ్రాలు పొదిగిన ఉంగరాలే!" అన్నాడు.

"వర్తకుడివి, నీ మాటలు నమ్మడం ఎలా?" అన్నాడు రాజు.

అప్పుడు మణిభద్రుడు ఆయనకు నగరంలో వున్న ఒక వజ్రనిపుణుడి పేరు చెప్పి, ఆయన్ని పిలిపించి ఉంగరాలను పరీక్షకు పెట్టమన్నాడు.

మర్నాడు రాజు కబురు చేయగా వజ్రనిపుణుడు వచ్చి, ఉంగరాలను పరీక్షించి, వాటిలో పొదిగినవి అపురూప వజ్రాలని చెప్పాడు. దానితో రాజూ, మంత్రీ, సైన్యాధ్యక్షుడూ చాలా సంతోషించారు.

వజ్రనిపుణుడు అక్కడినుంచి సరాసరి మణిభద్రుడి ఇంటికి వెళ్ళాడు. ఆ సమయంలో అతడు ప్రయాణమై పోయేందుకు భార్యతో కలిసి సామానులు సర్దుతున్నాడు.

"ఎలాంటి ఒడిదుడుకులు లేకుండా, నువ్వు చెప్పిన పని విజయవంతంగా ముగించాను. నా కిస్తానన్న అపురూప వజ్రం మాటేమిటి?" అని నవ్వుతూ వజ్రనిపుణుడు, మణిభద్రుణ్ణి అడిగాడు.

మణిభద్రుడు అతడికి ఒక ఉంగరం యిస్తూ, "ఇదీ అపురూప వజ్రంగల ఉంగరమే! వజ్రవర్తకులూ, వజ్రనిపుణులూ అన్నదమ్ముల్లాంటి వాళ్ళు. నీ సహాయానికి చాలా కృతజ్ఞుణ్ణి," అన్నాడు.

"ఇంతకూ, ఎంతో విలువైన ఆ అపురూప వజ్రం చౌకగా ఎవరి చేతుల్లో పడకుండా కాపాడుకున్నావు గదా! మరి, నగరం వదిలి పోవడం ఎందుకు?" అని అడిగాడు వజ్రనిపుణుడు.

మణిభద్రుడు విచారంగా, "రాజూ, మంత్రీ, సేనాధ్యక్షుల ముప్పు నుంచి ఎలా బయటపడ్డానో, నా భార్యకు ఇప్పుడే వివరంగా చెప్పాను. రాజాజ్ఞలు పాలిస్తూ, ఆయనతో సహకరించవలసిన మంత్రీ, సేనాధ్యక్షుడూ — ఆయనతో పోటీపడుతున్నారు. అలాంటి రాజ్యం ఏదో ఒకనాడు అల్లకల్లోలం కాక తప్పదు. అందుకే దీన్ని వదిలిపోతున్నాను," అన్నాడు.






# 7

[పింగళుడు పాడుదేవళంలోని, మొదటి ద్వారాన్ని దాటి రెండవ ద్వారం సమీపించి, అక్కడి పర్వతాకారుడికి తను ఎవరైందీ చెప్పి, ఆ ద్వారాన్ని కూడా అధిగమించాడు. కాని, ఆరవ ద్వారం దగ్గిర మాయాపద్మపాదుడి రూపంలో వున్న రక్కసి వల్ల అతడికి ప్రమాదం కలిగింది. ఆ రక్కసి అతణ్ణి దేవళం నుంచి గాలిలోకి విసరివేసింది. తరవాత—]

పద్మపాదుణ్ణి చూడగానే పింగళుడికి ప్రాణం లేచివచ్చినట్టయింది. అతడు తన కిక ప్రాణభయం లేదని గ్రహించాడు. అంతలో పద్మపాదుడు పింగళుణ్ణి కింద పడకుండా చేతులతో ఆదుకుని, మెల్లగా భూమి మీద నిలబెట్టాడు.

"పింగళా, ఏం జరిగింది? ప్రమాదకరమైన దెబ్బలేమీ తగలలేదు గదా?" అంటూ పద్మపాదుడు ప్రశ్నించాడు.

"దెబ్బల మాట తరవాత చూద్దాం. ముందు ప్రాణాలతో బయటపడ్డాను. అంతే చాలు," అని పింగళుడు వెనుదిరిగి ఆశ్చర్యంగా పాడుదేవళం కేసి చూశాడు. అతడు చూస్తూండగానే, అంతవరకూ ఒక్క నీటిచుక్క కూడా లేకుండా యింకిపోయిన నది, తృటి కాలంలో బుస్సుమంటూ ఒక్కసారి జలంతో పొంగసాగింది.








పద్మపాదుడు, పింగళుడి భుజం మీద చేయి వేసి, ''పింగళా, యీసారికి మనం ఓడిపోయాం. మహామాయుడి శిష్యులు తిరిగీ నదిని జలంతో నింపుతున్నారు. దేవాలయం కూడా అందులో మునిగిపోతుంది. అయినా, మనం కావాలనుకున్న నాడు, మళ్ళీ నదీజలాన్ని యింకింప చేయగలం. ముందు, నీ అనుభవాల సంగతేమిటో చెప్పు?'' అన్నాడు.

పింగళుడు, తను మొదటి ద్వారం దాటి, ఆరవ ద్వారాన్ని సమీపించేవరకూ జరిగిన సంఘటనలన్నీ చెప్పాడు.

''ఆ ఆరవ ద్వారం దగ్గిర అంత తెలివిగల భూతం కావలి వుంటుందని నేననుకోలేదు. హఠాత్తుగా, మీ ఆకృతి అక్కడ కనిపించింది. ''ఆగు, ఆగు. నువ్వెవరివి?'' అని నన్ను ప్రశ్నించిన కంఠస్వరం కూడా మీదే! నేను ఒక్క తృటికాలం సంశయించాను. యీ లోపల హఠాత్తుగా కళ్ళు మిరుమిట్లు కొలిపే గద ఒకటి మెరిసింది. నేను కళ్ళు మూసుకున్నాను. అంతే, నా వీపు మీదా, తల మీదా దభీదభీమని దెబ్బలు పడసాగినై. ఎవరివో బలమైన చేతులు నన్ను పడిసి పట్టుకుని ఆకాశంలోకి విసరివేసినై. కింద పడకుండా, మీరు నన్ను పట్టుకుని కాపాడారు,'' అన్నాడు పింగళుడు.

''అలాగా!'' అంటూ పద్మపాదుడు కళ్ళెఱ్ఱజేసి, నదీజలంలో మునిగిపోతున్న పాడుదేవళం కేసి ఓసారి చూశాడు. ''పింగళా! మహామాయుడి శిష్యులు యింత నీచానికి ఒడికట్టుతారని నేననుకోలేదు. నీ గురువునైన, నా ఆకృతిలో మాత్రమే వాళ్ళు నిన్ను మోసపుచ్చగలిగారు. అంతకుముందు వాళ్ళు నిన్ను భయపెట్టేందుకు ప్రయోగించిన ప్రతి దుష్టశక్తినీ జయించావు. అది నాకు చాలా ఆనందం కలిగిస్తున్నది!'' అన్నాడు.

పద్మపాదుడి మాటలు, పింగళుడికి చాలా ఉత్సాహం కలిగించినై. ''ఇప్పుడు చేయవలసిందేమిటి? దేవాలయం మళ్ళీ

నదీగర్భంలో మునిగిపోతున్నది!'' అన్నాడు.

''ఈ రోజుకు యింక మనం చేయ గలిగిందేమీ లేదు. నేటి నుంచి మూడు రోజుల తరవాత మళ్ళీ పర్వదినం ఒకటి రానున్నది. ఆనాడు తిరిగీ నువు మహా మాయుడి సమాధిలో ప్రవేశించవచ్చు. అంతవరకూ మనం యిక్కడే వుండ వలసి వుంది. యీ లోపల మనకు కాల క్షేపం జరిగేందుకు....'' అంటూ పద్మ పాదుడు, చేతనున్న గదను గాలిలో తిప్పి, ఏదో మంత్రం పఠించాడు. మరుక్షణం లోనే, ఆ నిర్జనప్రదేశాన ఒక ఎత్తయిన సుందరభవనం లేచి నిలబడింది.

ఆశ్చర్యంగా ఆ మాయాభవనం కేసి చూస్తున్న పింగళుడి చేయి పట్టుకుని, పద్మపాదుడు అతణ్ణి భవనం కేసి నడి పాడు. వారిద్దరూ భవనప్రాంగణాన్ని సమీపించేంతలో, ఠక్కున ద్వారం తెరుచుకున్నది. ఆజానుబాహులైన ఇద్దరు కాలదేహులు బయటికివస్తూ పద్మ పాదుడికీ, పింగళుడికీ తలలు వంచి నమస్కరించారు.

''పద్మపాదా, వీళ్ళెవరు?'' అన్నాడు పింగళుడు అనుమానంగా.

''ఏళ్ళు, మనకు యీ మూడు రోజులూ వినోదం కలిగించేందుకు వచ్చిన




మాయారక్కసులు. మనం యిక్కడ వూరికే గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోలేం గదా? యీ పిశాచమల్లులకు, కుస్తీ, కర్ర కత్తి యుద్ధాలు పెట్టి వినోదిద్దాం!'' అన్నాడు పద్మపాదుడు.

పింగళుడూ, పద్మపాదుడూ భవనంలో ప్రవేశించారు. వాళ్ళిద్దరూ ఒక ద్వారం నుంచి, ఒక పెద్ద గదిలోకి ప్రవే శిస్తూండగా, పింగళుడికి అక్కడ అనేక మంది మల్లులూ, యోధులూ కసరత్తులు చేస్తూండటం కనిపించింది. అతడు వారి కేసి చూస్తూ, ''పద్మపాదా, వీళ్ళందరూ కలిసి మనకేమైనా హాని తలపెట్టరు గదా?'' అన్నాడు.




"అలాంటి భయం నీకేమీ అవసరం లేదు!" అంటూ పద్మపాదుడు ముందుకు నడిచి, మొదట కనిపించిన కాలదేహులతో మెల్లిగా ఏమో చెప్పాడు. వాళ్ళు అక్కణ్ణించి హుటాహుటిగా వెళ్ళిపోయారు.

పద్మపాదుడూ, పింగళుడూ ఆ పెద్ద గదిలో వున్న పట్టుపరుపులకు ఆనుకుని కూర్చున్నారు. కొద్దిసేపట్లో వారి దగ్గిరకు, బంగారు పళ్ళెరాల్లో వివిధ భోజనపదార్థాలు పెట్టుకుని సౌందర్యవతులైన కొందరు స్త్రీలు వచ్చారు. పింగళుడు వారిని చూస్తూనే, "పద్మపాదా! వీళ్ళు గంధర్వ కాంతలా, లేక ఆ రూపాలు ధరించిన పిశాచినులా?" అని ప్రశ్నించాడు.

పద్మపాదుడు 'ఉష్' అని పింగళుణ్ణి వారిస్తూ, "పింగళా, అంత పెద్దగా మాట్లాడకు. పిశాచినులు ఏమైనా అనుకోగలవు. మనకు దాస్యం చేసేందుకు వచ్చిన పిశాచినులనైనా సరే మనం కొంచెపరచటం మంచిదికాదు. వాళ్ళను, యీ మూడు రోజులూ గంధర్వకాంతలుగానే సంభావిద్దాం!" అన్నాడు.

తరవాత పద్మపాదుడూ, పింగళుడూ భోజనాలు ముగించారు. అంతలో, కాలదేహులు యిద్దరూ కొందరు పిశాచ మల్లులనూ, యోధులనూ అక్కడికి తీసుకువచ్చారు. వాళ్ళు వివిధ రూపాలు ధరిస్తూ కుస్తీ, కత్తియుద్ధాలు చేసి, పింగళుడికీ, పద్మపాదుడికీ వినోదం కలిగించారు.

ఈ విధంగా మూడు రోజులు గడిచిపోయినై. నాలుగవనాడు పద్మపాదుడు, ఆ మాయాభవనాన్నీ, అందులో వున్న మాయారూపుల్నీ, తన మంత్రబలంచేత మాయం చేసి, యింతకు పూర్వం తను నది దగ్గిర కూర్చుని, మంత్రం పఠించిన చోటుకు వెళ్ళాడు.

పద్మపాదుడు ఇప్పుడు నదీగర్భంలో మునిగిపోయి వున్న పాడుదేవళం కేసి చేయి చూపుతూ, "పింగళా, నేను నదీ జలాన్ని యింకింపచేస్తాను. యీ సారి

నువ్వు మహామాయుడి సమాధిలో ప్రవేశించేప్పుడు తీసుకోవలసిన జాగ్రత్తలను గురించి నేను మళ్ళీ చెప్పనవసరం లేదు గదా ?'' అన్నాడు.

''పద్మపాదా, అలాంటి అవసరం ఏమీ లేదు. లోగడ తిన్న దెబ్బల కణుతులు యింకా కరిగి కూడా పోలేదు. నేను ఏం మరచిపోయినా, ఆ దెబ్బల బాధా, మీ రూపంలో నన్ను మోసగించిన, మహామాయుడి శిష్యుడి ముఖ కవళికలూ మాత్రం మరవను! యీసారి వాడి అంతు తేలుస్తాను,'' అన్నాడు పింగళుడు.




పద్మపాదుడు మంత్రం జపించి, కొద్ది సేపట్లోనే నదీజలాన్ని యింకింపజేశాడు. పింగళుడు, నిర్భయంగా పాడుదేవళపు మొదటి ద్వారాన్ని సమీపించి, బుసలు కొడుతున్న పాముపడగమీద చెయ్యి వేశాడు. అది వెంటనే ప్రాణం వదిలి కింద పడిపోయింది. తక్షణం తలుపుల వెనకనుంచి కర్ణకఠోరమైన ధ్వనితో ప్రశ్న వినబడింది.

''నా పేరు పింగళుడు! నేను అవంతీ నగరపు జాలరిని!'' అంటూ పింగళుడు ధైర్యంగా తలుపులను నెట్టాడు. తలుపులు తెరుచుకున్నవి. పర్వతాకారంలో వున్న నల్లనివాడు కత్తి ఝుళిపిస్తూ ముందుకు వచ్చాడు. ఆతడు, పింగళుణ్ణి మెడ చాచమనటం, పింగళుడు మెడ చాచటం పర్వతాకారుడు దభీమంటూ పడిపోవటం, అంతా పూర్వపద్ధతిగానే జరిగింది.

పింగళుడు, ఒక్కొక్క ద్వారాన్ని దాటి, చివరకు ఆరవ ద్వారాన్ని సమీపించేంతలో, ద్వారం పక్కనే, పింగళుడి తల్లి కళ్ళ నీళ్ళు కారుస్తూ, ''నాయనా, ఎందుకు వచ్చిన శ్రమ, వెంటనే వెనుదిరిగి పో! ఆ పద్మపాదుడు నిన్ను హతమార్చాలని చూస్తున్నాడు,'' అన్నది దీనాతి దీనంగా.

పింగళుడు నివ్వెరపోయాడు. ఆ వెంటనే అతడికి గత అనుభవం గుర్తుకు వచ్చింది. లోగడ తనను పద్మపాదుడి




రూపంలో మోసగించిన పిశాచమే, ఇప్పుడు తన తల్లి రూపం ధరించి మాయ చేయచూస్తున్నదని అతడు సులభంగానే ఊహించాడు.

"దారి తొలగు. నువ్వెవరో నాకు తెలుసు! నా తల్లి రూపం ధరించినా, నన్ను మోసగించలేవు!" అంటూ పింగళుడు ద్వారం పక్కన వున్న కత్తి నొకదానిని తీసుకుని ముందుకురికాడు. మాయారూపంలో వచ్చిన పిశాచి కెవ్వన కేక వేసి, వెంటనే మాయమయింది.

పింగళుడు పెద్దగా నవ్వి కత్తిని దూరంగా గిరవాటు వేసి ద్వారం దాటాడు. ఎదురుగా పట్టుతెరలు గాలికి రెప రెపలాడుతూ కనిపించినై. సన్నని ఆ తెరల వెనకనుంచి కాంతులు వెదజల్లుతున్న ఉన్నతాసనం ఒకటి కనిపించింది.

పింగళుడు పట్టుతెరలు తొలగించుకుని లోపలకు వెళ్ళాడు. రత్నమాణిక్యాల కాంతిలో దేదీప్యమానంగా వెలిగిపోతున్న సింహాసనం మీద మహామాయుడు యోగనిద్రలో వున్నట్టు కళ్ళు మూసుకుని కూర్చుని వున్నాడు. పింగళుడికి, ఓ క్షణకాలం మహామాయుడు సజీవుడేమో అన్న అనుమానం కూడా కలిగింది. అతడు గాలి పీల్చుకునేందుక్కూడా వెరిచి, అడుగులో అడుగు వేసుకుంటూ మహామాయుణ్ణి సమీపించాడు. అతడి దృష్టి, మహామాయుడి కుడిచేతి వేళ్ళ మీదకు పోయింది. అక్కడ, కాంతి కిరణాలను వెదజల్లుతున్న వేలివుంగరం పింగళుణ్ణి ఆకర్షించింది.

పింగళుడు నిర్భయంగా, మహామాయుడి కుడిచేతి వేలినుంచి వుంగరాన్ని వూడదీశాడు. ఇంక తనకు కావలసినవి రెండు వస్తువులు! వజ్రాలు తాపిన పిడిగల కత్తి, మహామాయుడి నడుముకు వేలాడ కట్టబడి వుంది. పింగళుడు దాన్ని వరతో కూడా తీసుకుని తన నడుముకు బిగించుకున్నాడు. ఇక కావలసింది, భూగోళం!

పింగళుడు నలువైపులా కలయ చూశాడు. అతడికి ఒక మూలగా మెట్లు కనిపించినై. ఆ మెట్లకు దిగువగా, ఒక ఎత్తయిన బల్లమీద గుండ్రని చంద్ర బింబంలా మెరుస్తూన్న భూగోళం కని పించింది. పింగళుడు దాన్ని సమీపించి గోళంలోకి చూశాడు. అందులో, వివిధ దేశాలూ, వాటి సరిహద్దులూ, పనిపాట్లలో మునిగివున్న ఆయాదేశ ప్రజలూ, అతడి దృష్టికి స్పష్టంగా కనిపించారు.

మహామాయుడి సమాధి నుంచి తను సంగ్రహించవలసిన మూడు వస్తువులూ పింగళుడికి లభించినై. అతడు భూగో ళాన్ని భుజం మీద పెట్టుకుని, ఆఖరి సారిగా మహామాయుడు కూర్చుని వున్న సింహాసనం కేసి చూసి, బయటికి బయలు దేరాడు.

పింగళుడు మహామాయుడి సమాధి గది నుంచి బయటికి నడిచేంతలో, ఎక్కడినుంచో చెవులకు విందు చేసే చక్కని గానం వినబడింది. "భేష్, పింగళా, నీ ధైర్యసాహసాలూ, తెలివి తేటలూ మా అందరి మెప్పును పొందినై!" అన్న మృదువైన కంఠస్వరం పింగళుడికి వినబడింది. ఆ కంఠస్వరం మహా మాయుడిదేమో అనుకుని పింగళుడు వెనుదిరిగి చూశాడు. కాని, మహా మాయుడిలో ఏమీ చలనం లేదు.

పింగళుడు అన్ని ద్వారాలూ దాటి బయటికి రాగానే, పద్మపాదుడు ఉత్సా హంగా చప్పట్లు చరిచి, "పింగళా, మనం జయించాం! ఇక, యీ ప్రపంచంలో మన శక్తికి తిరుగులేదు." అంటూ అమితానందంతో ముందుకు పరిగెత్తు కుంటూ వచ్చాడు.

అదే సమయంలో, నదీగర్భం నుంచి అగ్నిపర్వతం బద్దలయినట్టుగా పెద్ద ధ్వని వినబడింది. మరుక్షణం, తాటి చెట్టు ప్రమాణంలో నీటిధార ఒకటి భూమి లోంచి లేచింది. పద్మపాదుడు, దానిని చూస్తూనే అదురుకుని, వెనక్కు ఒక గంతువేశాడు. —(ఇంకా వుంది)






# శక్తిలేని రాక్షసుడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి, భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువ్వు పడుతున్న యింత శ్రమకూ కారణం, ఏమై వుంటుందో అర్థం కావడం లేదు. ఏదైనా కూడని పనిచేసి, శక్తి సంపన్నుడైన ఏ మునివల్లనో శాపం పొంది, యిలా యిక్కట్లలో చిక్కుకున్నావా? నిజమైన మునులు తాత్కాలికమైన కోప తాపాలకు వశులై శపించినా, దాని నుంచి విముక్తి పొందే మార్గం చెబుతారు. అయితే, విముక్తి పొందడం శాపగ్రస్తుడి బుద్ధిబలం మీదా, పరిస్థితుల సానుకూల్యం పైనా ఆధారపడి వుంటుంది. ఇందుకు ఉదాహరణగా వివిధ దేశాలు తిరిగి ఎన్నో శాస్త్ర విద్యలు నేర్చిన రత్నదీపు డనే

## బేతాళ కథలు



యువకుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ యిలా చెప్ప సాగాడు :

రత్నదీపు డనే యువకుడు కాశీకి పోయి విద్యాభ్యాసం పూర్తి చేసుకుని, దక్షిణాపథంలోని తన స్వగ్రామానికి తిరిగి వస్తూ, మహారణ్యంలో ఒక మునిని చూశాడు. రత్నదీపుడికి ఆ మునిని చూస్తూనే, ఒక ఆలోచన కలిగింది. తాను కాశీలో గురువుల వద్ద ఎంతో శ్రమించి గడించిన శాస్త్రజ్ఞానంతో సాధించలేని కార్యాలు, తపశ్శక్తితో తేలిగ్గా సాధించ వచ్చు. అందువల్ల, యీ మునికి కొంత కాలం శుశ్రూషలు చేసి, అయన ద్వారా తపశ్శక్తి పొందే మార్గం తెలుసుకోవాలనుకున్నాడు.

మునికి శిష్యులంటూ ఎవరూ లేరు; ఒంటరివాడు. చెట్ల కింద వున్న ఒక చిన్న కుటీరం, అయన నివాసస్థానం. ఆయన దాపులనున్న సెలయేటిలో స్నానం చేసి కుటీరానికి తిరిగి వస్తూండగా, రత్నదీపుడు ఆయనకు సాష్టాంగపడి లేచి, తానెవరైనదీ చెప్పుకుని, తన కోర్కె వెల్లడించాడు. ముని ఆదరపూర్వకంగా చిరునవ్వు నవ్వి వూరుకున్నాడు.

ఆనాటి నుంచీ రత్నదీపుడు మునికి సేవలు చేస్తూ, ఆరు నెలల కాలం గడిపాడు. ఈ కాలంలో ముని అతడితో ఒక్కసారైనా మాట్లాడలేదు. కుటీరం ముందున్న చెట్టుకింద పద్మాసనం వేసుకు కూర్చుని ధ్యానంలో మునిగిపోతూండేవాడు. రత్నదీపుడు ఆయనను రెండు, మూడుసార్లు తపోనిష్ఠకు అవసరం అయిన మంత్రమేదన్నా నేర్పమని అడిగాడు. ముని చిరునవ్వు నవ్వి వూరుకున్నాడు.

క్రమంగా రత్నదీపుడిలో భక్తి నశించి, మునిపట్ల ద్వేషభావం ఏర్పడింది. అతడేదైనా పెద్ద నేరంచేసి, రాజభటులకు దొరక్కుండా, యీ మహారణ్యం చేరినవాడై వుంటాడన్న అనుమానం కూడా కలిగింది.

ఒకనాడు ముని ధ్యానంలో వుండగా రత్నదీపుడు ఆయన భుజం పట్టుకుని గట్టిగా కుదిపి, "నేను ఆరు నెలలుగా నీకు సేవలు చేస్తున్నాను. ఒక్కనాడైనా, నాతో పెదవి కదిపి మాట్లాడలేదు. ఇంత వరకూ, నీ తపశ్శక్తికి నిదర్శనంగా ఏ మహత్తూ కనిపించలేదు. నువ్వు నిజంగా మునివేనా ?" అని అడిగాడు.

మునికి ధ్యానభంగమయింది. ఆయన రత్నదీపుడి కేసి కళ్ళెర్రచేసి, "ఓరీ, అహంకారీ, నా తపశ్శక్తి ఏ పాటిదో యిప్పుడే తెలుసుకుందువుగాని. కేవలం స్వార్థబుద్ధితో నువ్వు నా దగ్గిర చేరావు; అది మానవ సహజం! అందుకు నేను తప్పు పట్టను. కాని, యిప్పటి నీ దుందుడుకు ప్రవర్తన రాక్షససహజమైనది, కనుక రాక్షసుడివై పో. కాని, రాక్షసుడి శక్తి మాత్రం నీకుండదు. ఆ రూపంలో ఏవైనా పుణ్యకార్యాలు చేస్తే, నీకు తిరిగి మానవ రూపం సిద్ధిస్తుంది," అన్నాడు.

ఆ మరుక్షణం రత్నదీపుడు రాక్షసుడుగా మారి, ఆ మహారణ్యంలోని మరొక ప్రాంతానికి ఎగిరిపోయాడు.

ఒకనాడు వీరసేను డనే మహావీరుడొకడు దేశ సంచారం చేస్తూ, అరణ్యమార్గాన పోతూండగా, రాక్షసుడు చెట్టుపై



నుంచి అతడి ముందు దూకి, "ఆహా, కండ బలిసిన మనిషి. ఏం, నా అదృష్టం!" అన్నాడు.

రాక్షసుణ్ణి చూసి వీరసేనుడు ఏమాత్రం భయపడకుండా, "నిన్ను ముక్కలు, ముక్కలుగా చీల్చి చెండాడబోతున్నాను. ముందు ఆ సంగతి చూసుకో!" అంటూ కత్తి దూశాడు.

రాక్షసుడు నవ్వి, "నువ్వు, నా కాలి గోరంతలేవు; అయినా నీ ధైర్యానికి మెచ్చాను. నేను కళ్ళు మూసుకుని తెరిచేలోగా, నాకు అందకుండా పారిపోగల పక్షంలో, నిన్ను వదిలిపెడతాను," అన్నాడు.



''నువ్వు నన్ను వదలాలనుకున్నా, నేను నిన్ను వదలను,'' అంటూ హుంకరించాడు, వీరసేనుడు.

ఆ జవాబుతో రాక్షసుడు నీళ్ళుగారిపోయి, ''నా బెదిరింపులకు భయపడతావనుకున్నాను. రాక్షసాకారం తప్పితే, నాకే విధమైన శక్తీ లేదు. ఎవరైనా పిరికివాడు దొరికితే, నా బతుకు వెళ్ళపుచ్చుకుందామని చూస్తున్నాను,'' అన్నాడు.

వీరసేనుడు ఆశ్చర్యంగా, ''ఇంత పెద్ద రూపం వున్న నీకు శక్తి లేకపోవడమేమిటి?'' అన్నాడు.

''ఒకప్పుడు నేనూ మానవుణ్ణే. ఒక ముని శపించగా, యీ రూపం వచ్చింది. నావల్ల మానవులెవరికీ హానికలక్కుండా వుండాలని, ఆయన నాకు శక్తి లేకుండా చేశాడు. నీ ఎరుకలో ఎవరైనా పిరికివాళ్ళుంటే చెప్పు,'' అన్నాడు రాక్షసుడు.

''నీకు పిరికివాళ్ళకే లోటువచ్చిందా?'' అని అడిగాడు వీరసేనుడు.

''అంతే మరి. నే నీ అరణ్యంలో ఎవరి కంటబడ్డా, వాళ్ళు ధైర్యంగా నాకు ఎదురు తిరుగుతున్నారు. ముని శాపం సంగతి వాళ్లకు తెలిసిపోయిందో ఏమో!'' అన్నాడు రాక్షసుడు.

''అదేం కాదు. ధైర్యవంతులు మాత్రమే, యీ అరణ్యంలో అడుగు పెడతారు. నీకు పిరికివాళ్ళతో పని వున్నదనుకుంటే, మనుషుల మధ్యకు వెళ్ళాలి,'' అని చెప్పాడు వీరసేనుడు.

రాక్షసుడు, వీరసేనుడికి కృతజ్ఞత చెప్పుకుని, అరణ్యం వదిలి ఒక గ్రామంలోకి వెళ్ళి వాలాడు. అక్కడ వాడికి సోమయ్య అనేవాడు కనిపించాడు. కాని వాడు కూడా రాక్షసుణ్ణి చూసి ఏమాత్రం భయపడలేదు.

''నేనంటే నీకు భయం వేయడం లేదా?'' అన్నాడు రాక్షసుడు ఆశ్చర్యంగా.

''నాకు చావంటే భయం లేదు. అసలే తిండికి లేక చస్తున్నాను,'' అన్నాడు సోమయ్య చిరాగ్గా.

"చావంటే, ఈ ఊళ్ళో ఎవరికి భయముందో చెప్పు." అన్నాడు రాక్షసుడు.

"ఆ విశాలయ్యకు చావంటే ఎంత భయమో!" అన్నాడు సోమయ్య.

రాక్షసుడు వెంటనే విశాలయ్య ముందు వాలాడు. కాని, విశాలయ్య కూడా వాణ్ణి చూసి ఏమీ భయపడలేదు.

"బతకాలన్న ఆశతో ఎన్నో మందులు తింటున్నాను. ఒక్కటీ పనిచెయ్యడం లేదు సరిగదా, శరీరబాధ నానాటికీ ఎక్కువవుతున్నది. నీవు, నన్ను మింగేస్తే, ఈ బాధ నుంచి విముక్తి వస్తుంది." అన్నాడు విశాలయ్య.



రాక్షసుడు నిట్టూర్చి, "బతకాలని అనుకునేవారు, నీకు తెలిసినంతవరకూ ఎవ్వరూ లేరా?" అని అడిగాడు.

"నాకు వైద్యం చేస్తున్న రంగాచారికి బతుకు మీద ఆశ వున్నదని, నా నమ్మకం. నా నుంచి డబ్బు గుంజేందుకు, నా రోగాన్ని తగ్గనివ్వడం లేదని, నా అనుమానం," అన్నాడు విశాలయ్య.

రాక్షసుడు రంగాచారి ముందు వాలాడు. అతడు కూడా రాక్షసుణ్ణి చూసి ఏమీ భయపడకుండా, "నాకు భార్యంటే పంచప్రాణాలు. దానికోసమే నేను కష్టపడి సంపాయిస్తున్నాను. నిన్న అది మొత్తం డబ్బంతా తీసుకుని పుట్టింటికి వెళ్ళిపోయింది. నన్ను మింగేసి, నీ ఆకలి తీర్చుకో!" అన్నాడు.

రాక్షసుడు నీరసంగా, "నాకా శక్తి లేదు. పిరికివాళ్ళెవరైనా నన్ను చూసి భయపడితే, వాళ్ళను ఆవహించాలనుకుంటున్నాను. నన్ను వదిలించడానికి ఎవరైనా దైవపూజలు చేస్తే, నా కారణంగా దైవానికి పూజలందిన పుణ్యానికి, నాకి రాక్షసరూపం నుంచి విముక్తి లభిస్తుంది. నాకు ఒక్క పిరికివాడు కూడా దొరకడం లేదు," అన్నాడు.

"ఈ ఊళ్ళో వున్న పిసినిగొట్టు భూషయ్య చాలా పిరికివాడని చెప్పుకుంటారు!" అన్నాడు రంగాచారి.



రాక్షసుడు పోయి భూషయ్య ముందు వాలాడు. భూషయ్య వాణ్ణి చూస్తూనే గడగడ వణికిపోసాగాడు.

"నా పేరు చెప్పి నాలుగు రోజుల పాటు శివాలయంలో అర్చనలుచేయించు. నిన్నేమీ చెయ్యను," అన్నాడు రాక్షసుడు.

"అర్చనలు చేయించాలంటే డబ్బు ఖర్చవుతుంది. అది నా వల్ల కాదు," అన్నాడు భూషయ్య.

"అయితే, నిన్ను మింగేస్తాను!" అన్నాడు రాక్షసుడు.

"మింగితే మింగు. నాకు ప్రాణం పోయినా ఫరవాలేదు. డబ్బు మాత్రం ఖర్చవకూడదు," అన్నాడు భూషయ్య.

డబ్బు ఖర్చు పెట్టాలనేసరికి, అతడికి ఎక్కడలేని తెగింపూ వచ్చేసింది.

"నాకీ రాక్షసరూపం నుంచి విముక్తి లేదు!" అనుకుంటూ రాక్షసుడు మరో గ్రామానికి బయలుదేరాడు.

వాడు ఊరి పొలిమేర చేరేసరికి, అక్కడ ఉత్సాహంగా పాటలు పాడుతూ, గంతులేస్తున్న సోమయ్య కనిపించాడు. రాక్షసుడు వాణ్ణి, "ఇప్పుడు యింత ఉత్సాహంగా వున్నావేం?" అని అడిగాడు.

సోమయ్య, రాక్షసుణ్ణి చూస్తూనే గజ గజ వణికిపోతూ, "నన్నేమీ చెయ్యకు, నాకింకా బతకాలని వున్నది. విశాలయ్య నన్ను దత్తత చేసుకుంటా నన్నాడు. తానెలాగూ ఎంతోకాలం బతకనప్పుడు, నావంటి వాడికి ఉపకారం చేయాలని పించిందట. ఇదంతా, నీ చలవే!" అంటూ చేతులు జోడించాడు.

విషయమేమిటో తెలుసుకుందామని, రాక్షసుడు విశాలయ్య యింటికి వెళ్ళాడు. వాణ్ణి చూస్తూనే విశాలయ్య నిలువునా వణికిపోసాగాడు.

"నీ కూడా బతుకు మీద ఆశ పుట్టినట్టుందే!" అన్నాడు రాక్షసుడు.

"ఆ వైద్యుడు రంగాచారికి, నువ్వేం మంత్రం వేశావోగానీ, యింతకుముందే హడావిడిగా వచ్చి నాకొక గుళిక ఇచ్చాడు.

దాంతో సగం బాధ చేత్తో తీసేసినట్టు పోయింది. దయవుంచి నన్ను కొంతకాలం బతకనియ్యి.'' అన్నాడు విశాలయ్య.

రాక్షసుడు రంగాచారి వద్దకు వెళ్లాడు. అతడికీ బతుకు మీద ఆశ పుట్టింది. విశాలయ్యకు మందిచ్చి వచ్చేసరికి, అతడి భార్య వెనక్కు తిరిగి వచ్చింది. పుట్టింటి కేసి సగం దూరం వెళ్ళేసరికి ఆవిడకు పశ్చాత్తాపం కలిగిందట. ఆమె తిరిగి వచ్చి, తన తప్పు మన్నించమని భర్త పాదాలమీద పడింది. దానితో రంగాచారికీ బతుకు మీద తీపి కలిగింది!

రాక్షసుడి కిప్పుడు పిరికివాళ్ళు దొరికారు! కానీ, వాళ్ళతో ఏర్పడిన పరిచయం కారణంగా, వాళ్ళనేమి చేయడానికీ వాడికి మనసొప్పడం లేదు. అక్కణ్ణించి వాడు మరొకసారి భూషయ్య యింటికి పోయి, అతణ్ణి పలకరిద్దామనుకుంటూండగా, క్షణాల మీద శరీరం కుంచించుకుపోయి, అలనాటి రత్నదీపుడుగా మారిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, ముని శాపంతో రాక్షసుడుగా మారిన రత్నదీపుడు, ఏ పుణ్యం చేయకుండానే తన రాక్షస రూపాన్ని ఎలా పోగొట్టుకోగలిగాడు? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రాక్షసుడు పుణ్యం చేయలేదనడం నిజం కాదు. కావాలంటే వాడు మధ్యలో బతుకు మీది తీపికొద్దీ పిరికివాళ్ళుగా మారిన ముగ్గుర్ని తినవచ్చు. కాని, వాడలా చెయ్యలేదు. ఎన్ని దైవపూజలు చేసినా, దైవార్చనలు చేయించినా, మూడు నిండు ప్రాణాలను నిలబెట్టడంతో సరిరావు కదా! ఆ పుణ్యం ఏమైపోతుంది? ఆ కారణం వల్లనే రత్నదీపుడికి రాక్షసరూపం పోయి, యథారూపం వచ్చింది,'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# కళాపోషణ

కొండపల్లి జమీందారుకు కవులన్నా, కళాకారులన్నా బొత్తిగా కిట్టేది కాదు. ఆయన కవిత్వం చెప్పేవాళ్ళందర్నీ ఖైదులో పెట్టాలనేవాడు. ఎవరైనా చక్కని సంగీతం పాడి వినిపిస్తామంటే, రెండు చెవులూ మూసుకునేవాడు.

జమీందారు యీ విపరీతపైఖరివల్ల, సాటి జమీందార్లలో చులకన అవుతున్నాడని, దివానుకు బాధగా వుండేది. ఉన్నట్టుండి జమీందారు ఒకనాడు, దివానుతో ఒక మంచి చిత్ర కారుణ్ణి చూసి, తన వద్దకు పంపమన్నాడు.

జమీందారులో వచ్చిన మార్పుకు దివాను చాలా సంతోషించి, పేరు పొందిన ఒక చిత్ర కారుణ్ణి ఆయన వద్దకు పంపుతూ, "మా జమీందారు వద్దకు వెళ్తున్న మొట్టమొదటి కళాకారుడివి, నువ్వే! ఆయనను ఎలా మెప్పిస్తావో మరి," అన్నాడు.

ఒక గంట తరవాత చిత్రకారుడు తిరిగివచ్చి, దివానుతో, "మీ జమీందారుకు కళాపోషణ తెలియదన్నవాళ్ళు, ఒట్టి పామరులు. ఈ గంటసేపూ ఆయన, నా చేత ఎన్నాళ్ళనుంచో బూజు పట్టిన తన పూర్వీకుల చిత్తరువులన్నీ దగ్గిరుండి తుడిపించాడు. అందుకు పారితోషికం కూడా ఘనంగా యిచ్చాడు, పది రూపాయిలు!" అన్నాడు.

ఇది విన్న దివానుకు నోటమాట రాలేదు.

—జొన్నలగడ్డ రత్న





# లోకం తీరు

ధర్మయ్య కష్టజీవి. రోజంతా శ్రమపడి పనిచేసి తెచ్చినదానితో, కలో గంజో తాగి గుట్టుగా సంసారాన్ని యీదుకు వస్తున్నాడు.

అతడిది కుచేల సంతానం. తన పేదరికంవల్ల, వాళ్ళను కూడా గుడ్డతో పోషించలేక సతమతమవుతున్నాడు. దీనికి తోడు పెద్దవాళ్ళు నలుగురూ ఆడపిల్లలు కావడంవల్ల, మగపిల్లలు చేతికి అంది వచ్చే లోపల, వాళ్ళు కాస్తా పెళ్ళీడుకు వచ్చారు.

ధర్మయ్య కూతుళ్ళకు పెళ్ళిళ్ళు చేయడం తలకు మించిన పని. అతడి భార్య పార్వతమ్మ, అతడు పనినుంచి ఇంటికి రాగానే, కూతుళ్ళ పెళ్ళి గురించి ప్రస్తావిస్తూండేది.

ధర్మయ్య భార్యవంక నిస్సహాయంగా చూస్తూ వుండిపోయేవాడు.

అతడి కొడుకులు అక్కల పెళ్ళిళ్ళకు డబ్బు కూడబెడదామని, తాము కూడా తండ్రితోపాటు కాయకష్టం చేయడానికి సిద్ధపడ్డారు. ఇంకా పసితనం వదలని నలుగురు కొడుకుల వంక జాలిగాచూసి, వద్దని వారించబోయాడు ధర్మయ్య. వాళ్లు వినకుండా, తండ్రితోపాటు కూలిపనికి బయలుదేరారు.

ధర్మయ్య ఇంటి పెరట్లోని వేపచెట్టు నాశ్రయించుకుని గృహదేవతలు—భార్యాభర్తా వుంటున్నవి.

ఒకనాడు మగదేవత, ఆడదేవతతో, "మనం ఎంతో కాలంగా, ఈ గృహాన్నీ, చెట్టునూ ఆశ్రయించుకుని వుంటున్నాం గదా? అయినా, ఎంతో పేదరికంలో వున్న యీ ధర్మయ్యకు ఎలాంటి సాయమూ చెయ్యలేదు. ఏదైనా సాయం చేస్తే బావుంటుంది," అన్నది.

బొమ్మిడి అచ్చారావు



ఆ మాటలతో ఆడ గృహదేవతా జాలి పడి, "అవును, ఏదైనా చేయడం బావుంటుంది. వీళ్ళది ఒకప్పుడు, కలిమిగల సంసారం, పరిస్థితులు ప్రతికూలించి, ప్రస్తుతం యిలా పేదరికం అనుభవిస్తున్నారు. ఏం సాయం చేద్దామంటావు?" అని అడిగింది.

"కొంత డబ్బు తెచ్చి, ధర్మయ్య కళ్ళ పడేలా చేద్దాం. దానితో అతడి కష్టాలు గట్టెక్కుతాయి. ఏ చింతా లేకుండా, కూతుళ్ళ పెళ్ళిళ్లు చేసుకోగలుగుతాడు," అన్నది మగదేవత.

అందుకు ఆడదేవత సరేనన్నది. ఇద్దరూ కలిసి డబ్బు తెచ్చి, ఒక రాత్రి వేళ ధర్మయ్య పెరట్లోని బావి దగ్గిర, ఆ డబ్బు మూటను పడవేశాయి. ఉదయమే లేచి పెరట్లోకి వచ్చిన ధర్మయ్య, ఆ డబ్బు మూటను చూసి, దాని మూతికి బిగించివున్న తాడు విప్పాడు. అతడి కళ్లు చెదిరిపోయాయి. ఆనందంకొద్దీ పెద్దగా కేక పెట్టాడు. అది విని, ఇంటిల్లిపాదీ పెరట్లోకి వచ్చారు.

అందరి కళ్ళూ డబ్బు మూట మీద పడ్డాయి. ముందుగా ధర్మయ్య పెద్ద కొడుకు—ఆడపిల్లల తరవాతివాడు, తండ్రితో, "నాన్నా, యీ డబ్బుతో మనం భారీ ఎత్తున ఏదైనా వ్యాపారం ప్రారంభిద్దాం. మన దరిద్రం వదిలిపోతుంది," అన్నాడు.

ధర్మయ్య మిగిలిన ముగ్గురు కొడుకులూ, అన్నకేసి కోపంగా చూస్తూ, "అదేం కుదరదు! ఆ డబ్బులో కొంత ఖర్చు పెట్టి, మేం ముందు చక్కని దుస్తులు కుట్టించుకుని, మిగిలినది పెట్టి పట్నంలో ఎవరైనా మంచి గురువువద్ద చదువుకుంటాం," అన్నారు.

కొడుకులిలా అనగానే, ధర్మయ్య భార్య, "ఆగండర్రా, మీరు!" అంటూ వాళ్ళను కసురుకుని, "నాకు ఎన్నాళ్ళుగానో బంగారు నగలు చేయించుకోవాలని ఆశగా వున్నది. ఎంతకూ వదలని పేద

రికం వల్ల, ఈనాటివరకూ ఆ ముచ్చట తీరిందికాదు. ఈ డబ్బుతో నగలు చేయించుకుంటాను,'' అన్నది.

ధర్మయ్య అందర్నీ ఆగండన్నట్టు చేయి వూపి, ''ఈ డబ్బుతో ముందు ఒక చక్కని భవంతి కట్టుకోవాలి. తరవాత కొంత పొలం కొనాలి. అప్పుడే మనం ఊళ్ళో వున్న నలుగురిలోనూ దర్జాగా, హొదాగా బతగ్గలం. కనక నా మాట విని ఈ డబ్బు జోలికి ఎవరూ రాకండి!'' అన్నాడు.

కొంచెం ఎడంగా నిలబడి, యిదంతా గమనిస్తున్న ధర్మయ్య పెళ్ళికెదిగిన కూతుళ్ళు మాత్రం, ఏ కోరికా వెలిబుచ్చలేదు. కాని వాళ్ళ మనసులో తమ పెళ్ళిళ్ళ గురించిన మోయలేనంత ఆరాటం వున్నది.

వేపచెట్టు మీద వుండి యిదంతా చూస్తున్న గృహదేవతలకు, ధర్మయ్యా, అతడి భార్యా, మగపిల్లల ప్రవర్తన చాలా ఆశ్చర్యం కలిగించింది.

మగదేవత, ఆడదేవతతో, ''చూశావా, వీళ్ళ కోరికలు! ఇప్పటివరకూ, ఆడపిల్లల పెళ్ళిళ్ళ సంగతే ఎవరూ తేలేదు. అందరికీ తమ, తమ కోర్కెలు తీర్చుకోవడమే ముఖ్యంగా కనిపిస్తున్నది. ఆఖరికి కన్నతల్లి కూడా, కూతుళ్ళపట్ల తన బాధ్యత మరిచిపోయి, నగలవ్యామోహంలో పడిపోయింది. ఇదన్నమాట, లోకం తీరు!'' అన్నది.



ఆడదేవత విచారంగా, "అవునవును, ఇదంతా డబ్బు మహిమ! అసలు డబ్బు లేనప్పుడు అందరూ ఒక్క మాట మీద నిలబడ్డారు. అందరూ ఆడపిల్లల పెళ్ళిళ్ల గురించే ఆలోచించారు. డబ్బు కళ్ళబడ గానే అదంతా మరిచిపోయి, ఎవరి స్వార్థం కోసం వాళ్ళు పాకులాడుతున్నారు. ఉండు, ఒక చిన్న తమాషా చేస్తాను!" అన్నది.

ఈ లోపల ధర్మయ్యా, అతడి భార్యా, మగపిల్లలూ మేం చెప్పినట్టే జరగా లంటూ పెద్దగా వాదులాడుకుంటున్నారు.

ఇంతలో హఠాత్తుగా మూటలో వున్న నాణేలు, చిన్న, చిన్న రాళ్ళుగా మారి పోయినై. అది చూసి అందరూ నివ్వెరపడి పోయారు.

ధర్మయ్య భార్య లబోమంటూ, "అయ్యో, మనం డబ్బని భ్రమపడ్డాం గాని, యివన్నీ రాళ్ళూరప్పలూ. మంత్ర తంత్రాలు నేర్చిన వాళ్ళెవరో మనను ఆట పట్టించేందుకు యిలా చేశారు," అన్నది.

అందరూ నిరాశతో తలలు వేళ్ళాడ వేశారు. ముందుగా ధర్మయ్య భార్య కొంచెం తేరుకుని, "చూశారా, మనమంతా దీన్ని డబ్బనుకుని భ్రమపడి మన కోరి కలు తీర్చుకునేందుకు తగువు ప్రారం భించాం. ఎదురుగా పెళ్ళీడుకొచ్చిన ఆడ పిల్లలున్నారు, మనలో ఏ ఒకళ్ళకూ వాళ్ళ సంగతే గుర్తు రాలేదు!" అన్నది విచారంగా.

ధర్మయ్య వంచిన తల ఎత్తలేక, "అవును, ఆ మాటే మరిచాను," అన్నాడు.

ధర్మయ్య కొడుకులు సిగ్గుపడిపోతూ, తల్లితో, "ఎలాగైనా కష్టపడి పనిచేసి డబ్బు కూడబెట్టి, అక్కల పెళ్ళి మేం చేస్తాం, మా మాట నమ్ము. ఇప్పుడు జరి గినదంతా మరిచిపోదాం," అన్నారు.

వేపచెట్టు మీద వుండి, యిదంతా గమనిస్తున్న గృహదేవతలకు, ధర్మయ్య కుటుంబం వివాదాలు మాని, తిరిగి ఒక టయినందుకు చాలా సంతోషం కలిగింది.





# వింత హెచ్చరిక

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించే కాలంలో, వారణాసిలో సేనకుడనే ఒక గొప్ప సాధువు వుండేవాడు. బోధిసత్వుడి అనేక పూర్వజన్మలలో, యీ సాధుజన్మ ఒకటి.

అదే కాలంలో నగరానికి దాపులనున్న ఒక గ్రామంలో, భిక్షాటనతో జీవించే బ్రాహ్మణుడొకడుండేవాడు. అతడొకనాడు పొరుగు గ్రామాలలో బిచ్చం ఎత్తి, ఒక అడవిగుండా ఇంటికి తిరిగి వస్తూండగా, ''ఓయీ, బ్రాహ్మణుడా, యీ రోజు నువ్వు ఇంటికి వెళ్ళకపోతే, నీకు మరణం తప్పదు; ఇంటికి వెళ్ళడం జరిగితే, నీ భార్య మరణం ఖాయం!'' అన్న మాటలు వినిపించినై.

బ్రాహ్మణుడు ఆ మాటలు వింటూనే, చుట్టూ కలయచూశాడు. ఎవరూ కనిపించలేదు. ఆ హెచ్చరిక చేసినది ఏ పిశాచమో, యక్షుడో అన్న అనుమానం కలిగిందతడికి.

భయంతో నిలువెల్లా వణికిపోతూ బ్రాహ్మణుడు త్వరగా యిల్లు చేరాలనుకున్నాడు. కాని, అలా చేయడం తన భార్య మరణానికి కారణం అవుతుంది. అడవిలోనే వుండిపోతే తన మరణం తప్పదు. ఇలాంటి విషమ పరిస్థితిలో ఏం చేయాలో తోచక అతడికి మతిపోయినంత పనయింది.

బ్రాహ్మణుడు ఆ సంకట స్థితిలో అడవి దాటి, నగరంలోని ఒక వీధివెంట నడుస్తూండగా, బోధిసత్వుడైన సేనకుడు ఒకచోట చాలామంది ప్రజలకు ధర్మబోధ చేస్తున్నాడు. ఆయన ఒక ఉన్నతాసనంపై కూర్చుని మాట్లాడుతూండగా, చుట్టూ గుమిగూడిన ప్రజలు, ఆ మాటలను ఎంతో భక్తిశ్రద్ధలతో వింటున్నారు.





బ్రాహ్మణుడు అక్కడికి పోయి జనం వెనకగా నిలబడ్డాడు. ప్రాణభయంతో అల్లాడిపోతున్న అతడు బోధిసత్వుడు చెబుతున్నదేమిటో శ్రద్ధగా వినకపోయినా, ఆయనను చూస్తూ నిశ్చలంగా వుండిపోయాడు.

కొంతసేపటికి బోధిసత్వుడు మాట్లాడడం ముగించగానే జనం హర్షధ్వానాలు చేశారు. బ్రాహ్మణుడు ఆవేదనపడుతూ, స్థాణువులా కదలామెదలక వూరుకున్నాడు.

ఉన్నతాసనం మీది నుంచి బ్రాహ్మణుణ్ణి చూసిన బోధిసత్వుడు, అతణ్ణి తన వద్దకు రమ్మన్న సూచనగా చేయి వూపాడు.

బ్రాహ్మణుడు ఆయన వద్దకు పోయి తలవంచి నమస్కరించాడు.

బోధిసత్వుడు అతణ్ణి, "నీకు వచ్చిన కష్టమేమిటి?" అని అడిగాడు.

బ్రాహ్మణుడు కళ్ళనీళ్ళు పెట్టుకుని, అడవిలో జరిగిన దానిని గురించి ఆయనకు చెప్పాడు.

"ఆ అశరీరవాణి మాటలు వినే ముందు, నువ్వేం చేస్తున్నావు?" అని అడిగాడు బోధిసత్వుడు.

"నే నొక చెట్టుకిందె కూర్చుని, సంచీ విప్పి, అందులో వున్న ఆహారం తిన్నాను," అన్నాడు బ్రాహ్మణుడు.

"నువ్వు, ఆహారం దాచుకున్న సంచీ కనబడుతూనేవున్నది. వెంట నీటి పాత్ర



మాత్రం లేదు. భోజనం చేశాక దాహం ఎక్కడ తీర్చుకున్నావు?'' అని అడిగాడు బోధిసత్వుడు.

''దగ్గిర్లో ఒక సెలయేరున్నది. అక్కడికి పోయి దాహం తీర్చుకున్నాను,'' అన్నాడు బ్రాహ్మణుడు.

''నువు తినగా, సంచీలో యింకేమైనా ఆహారం మిగిలిందా?'' అన్నాడు బోధిసత్వుడు.

''స్వామీ, సంచీలో వున్న ఆహారంలో సగమే తిన్నాను. తతిమ్మా సగం సంచీలోనే వున్నది.'' అని జవాబిచ్చాడు బ్రాహ్మణుడు.

బోధిసత్వుడు ఒక క్షణం ఆగి, ''నువ్వు నీటికోసం సెలయేటి దగ్గిరకు వెళ్ళే ముందు, సంచీమూతి, తాడుతో బిగించి కట్టావా?'' అని అడిగాడు.

''ఆ పని సెలయేటి నుంచి తిరిగి వచ్చాక చేశాను. తరవాత సంచీ తీసుకుని అక్కణ్ణించి బయలుదేరాను,'' అన్నాడు బ్రాహ్మణుడు.

''సంచీమూతి బిగించేముందు, దాని లోపలికేమైనా చూశావా?'' అన్నాడు బోధిసత్వుడు.

బ్రాహ్మణుడు అప్పుడు జరిగిందేమిటో జ్ఞాపకం తెచ్చుకునేందుకు రెండు మూడు క్షణాలు ఆలోచిస్తూ వూరుకుని, తరవాత, ''స్వామీ, అలా చేయలేదు,'' అన్నాడు.

బోధిసత్వుడు, ఆ సమయంలో ఏం జరిగివుంటుందో ఊహించేందుకు ప్రయ



త్నిస్తూ, కొంతసేపు మౌనంగా వుండిపోయి, బ్రాహ్మణుణ్ణి, "నువ్వు చెట్టు కిందినుంచి బయలుదేరగానే, నీకూ, నీ భార్యకూ రానున్న ప్రమాదం గురించిన హెచ్చరిక వినబడిందా?" అని అడిగాడు.

"అవును, స్వామీ! నేను కనీసం పదీ, పన్నెండడుగులైనా నడిచి వుండను. ఎవరో స్పష్టమైన కంఠస్వరంతో, ఆ వింత హెచ్చరిక చేశారు," అన్నాడు బ్రాహ్మణుడు.

"అంటే, నువ్వు చెట్టు దగ్గిరనుంచి బయలుదేరేముందు ఏదో జరిగివుండాలి. బహుశా, ఏపామో, సంచీలో వున్న ఆహారం కోసం అందులో ప్రవేశించివుంటుంది. అది గమనించిన, ఏ యక్షుడో లేక వృక్ష దేవతో నిన్ను హెచ్చరించింది. నువ్వు, యీ రోజు ఇంటికి చేరకపోతే, ఆహారం కోసం సంచీ మూతి విప్పి, అందులో చేయి పెడతావు, పాము నిన్ను తప్పక కాటువేసి, నీ మరణానికి కారణం అవుతుంది. అలాకాక, యీ రోజే నువ్వు ఇల్లు చేరితే, ని భార్య సంచీలో ఏమున్నదో చూసేందుకు, దానిలో చేయి పెట్టి, పాము కాటుకు మరణిస్తుంది!" అన్నాడు బోధిసత్వుడు.

ఆయన, బ్రాహ్మణుడికి సంచీ తన ఆసనం పక్కన పెట్టవలసిందిగా చెప్పాడు. ఆ సమయంలో జనంలోవున్న ఒక పాములవాడు అక్కడికి వచ్చి సంచీ మూతి విప్పాడు. లోపలినుంచి బుసలు కొడుతూ ఒక నాగుపాము బయిటికి వచ్చింది.

వెంటనే పాములవాడు నేర్పుగా దానిని వడిసి పట్టుకుని దూరంగా తీసుకుపోయాడు.

అప్పుడు బోధిసత్వుడు బ్రాహ్మణుడితో, "నువ్విప్పుడు అన్ని భయాలూ వదిలి, హాయిగా ఇంటికి పోవచ్చు," అన్నాడు చిన్నగా నవ్వుతూ.

బ్రాహ్మణుడు, ఆయనకు తన కృతజ్ఞత చెప్పుకుని, తేలికపడిన మనస్సుతో, ఇంటి దారి పట్టాడు.






# బంగారు గులాబీలు

అర్మీనియా దేశంలోని, ఒక గ్రామంలో పేద రైతు ఒకడుండేవాడు. అతడికి, అంతగా సారవంతంగాని ఒక ఎకరం పొలం వుండేది. రైతూ, అతడి భార్యా, కొడుకూ ఎంత కష్టపడ్డా, వాళ్ళకు ఆ పొలంనుంచి తిండికి సరిపడా ఫలసాయం వచ్చేదికాదు. ఆ కారణంవల్ల వాళ్ళు తరచుగా పస్తులుంటూండేవాళ్ళు.

ఈ గడ్డు పరిస్థితుల్ని తట్టుకోలేక రైతు మరొక ప్రాంతానికి వలసపోదలచి, తన ఎకరం పొలాన్ని, పక్కనవున్న మరొక రైతుకు అమ్మేశాడు. ఈ రైతూ అంత కలిగినవాడుకాదు. ఎంతో శ్రమపడి కూడబెట్టిన కొద్దిపాటి డబ్బుతో పొలం కొని, ఒకనాడు దానిని దున్నసాగాడు.

హఠాత్తుగా నాగటికర్రుకు ఏదో గట్టిగా తగిలి శబ్దమయింది. రైతు అక్కడ తవ్వి చూడగా, ఒక చిన్న పాత్రలో చాలా బంగారు నాణాలు కనిపించినై. అతడు చాలా నీతివంతుడు కావడంవల్ల, వెంటనే ఆ పాత్ర తీసుకుని, తనకు పొలం అమ్మిన పేద రైతు వద్దకు పోయి, "నువ్వు అమ్మిన పొలంలో, నాకీ బంగారు నాణాలు దొరికినై. నేను, నీ పొలం కొన్నాను తప్ప, అందులో వుండే నిధినిక్షేపాలను కొనలేదుగదా? ఈ బంగారం నీదే, తీసుకో!" అన్నాడు.

అందుకు పొలం అమ్మిన రైతు, "అదెలా? నేనిప్పుడు అమ్మిన పొలానికి హక్కుదారువు, నువ్వు. అందువల్ల, అక్కడ లభించే ప్రతిదీ, నీదే! న్యాయంగా నాదికాని దానిని, నేనెలా పుచ్చుకునేది," అన్నాడు.

"నా చేత నీతిమాలినపని చేయించకు. ఇతరుల అమాయకత్వాన్ని ఆధారం చేసుకుని, లాభపడే తత్వం నాది కాదు.

అర్మీనియా జానపద కథ

వాదం మాని, యీ బంగారం తీసుకో!'' అన్నాడు పొలం కొన్న రైతు కోపంగా.

ఇద్దరికీ చాలా సేపు వాగ్వాదం జరిగి, చివరకు కొట్టుకునేవరకూ పోయారు. కొంతసేపటికి ఇద్దరూ శాంతపడి, రాజునే న్యాయం చెప్పమని అడగడం బావుంటుందని, ఆయన దగ్గిరకు వెళ్ళారు.

రాజుకు, ఆ ఇద్దరి ధర్మగుణం చూసి ఎక్కడలేని ఆశ్చర్యం కలిగింది. ఆయన కొంచెంసేపు ఆలోచించి, పొలం అమ్మిన రైతును, ''నీకెందరు పిల్లలు?'' అని అడిగాడు.

"అయ్యా, ఒకే 'ఒక కొడుకు,'' అన్నాడు రైతు.

''నాకు ఒకే కూతురు,'' అన్నాడు పొలం కొన్న రైతు.

''ఆహా, ఎంత అద్భుతం!'' అంటూ రాజు మరొకసారి ఆశ్చర్యపోయి, రైతులతో, ''ఆ ఇద్దరికీ పెళ్ళి చేయండి. తరవాత పెళ్ళికానుకగా, ఆ బంగారాన్ని వాళ్ళకు బహూకరించండి,'' అన్నాడు.

ఇంత తేలిగ్గా సమస్య పరిష్కారమైనందుకు రైతులిద్దరూ చాలా సంతోషించారు.

రైతులు దొరికిన బంగారంతో మంచి సారవంతమైన పొలం కొని, అందులో మంచి భవంతి కట్టుకున్నారు.

తరవాత పదిమందీ మెచ్చుకునే విధంగా పిల్లలకు ఘనంగా వివాహం



చేసి, ఇరుగుపొరుగువాళ్ళకు గొప్ప విందుభోజనం పెట్టారు.

ఆ నాటినుంచీ, ఆ రెండు కుటుంబాలూ ఎంతో అన్యోన్యంగా జీవిస్తూ, వ్యవసాయం చేసుకోసాగారు. పంటలు బాగా పండడంతో, కొద్ది కాలంలోనే వాళ్ళు మంచి సంపన్నులయ్యారు. పొలంలో బంగారం వున్న పాత్ర దొరికిన చోట, అందరూ అద్భుతం చెందేలా ఒక గులాబీ పొద మొలకెత్తింది. అది బంగారంలా మెరిసిపోయే పువ్వులు పూయసాగింది.

ఒకనాడు రాజు కొడుకు వేటకు పోతూ బంగారు గులాబీలను చూశాడు. అతడికి వాటిని కోసి వెంట తీసుకుపోవాలన్న కోర్కె కలిగింది. ఆ గులాబీ పొదవున్న పొలం యజమానిని ముందుగా అడగాలన్న ఆలోచన లేకుండా, అతడు గుర్రం దిగి, పూలున్న ఒక మండను పట్టుకుని బలంగా లాగాడు. ఆ మరుక్షణం గులాబీ పొద భూమి మీదినుంచి అతడి తల మీదుగా పైకెగిరి, వేగంగా ఆకాశంలో మాయ మయ్యింది.

రాజు కొడుక్కు ఆశ్చర్యం, కోపం కూడా కలిగింది. అతడు గుర్రం ఎక్కి కొంత దూరం పోయి తల తిప్పి వెనక్కు చూశాడు. గులాబీ పొద యథాస్థానంలో వున్నది. ఈ వింత చూసి రాజు కొడుకు దిగ్భ్రాంతుడయ్యాడు.

అతడు మరొకసారి గులాబీ పొద దగ్గిరకు వచ్చి, ఒకే ఒక పువ్వు కోసుకుపోవా





లని చూశాడు. కాని, అతడి చేయి తగులుతూనే పొద రివ్వుమంటూ ఆకాశంలోకి ఎగిరిపోయింది.

రాజు కొడుక్కు మతిపోయినంత పనయింది. అతడు గుర్రం ఎక్కి కొంత దూరం పోయి మళ్లీ వెనక్కు తిరిగి చూశాడు. గులాబీ పొద మామూలు చోటునే వున్నది.

అతడు మరొకసారి తిరిగివచ్చి, ఎలాగైనా ఒక బంగారు గులాబీ సంపాయించాలన్న పట్టుదలతో, రెండు చేతులూ చాచి ఒక పువ్వు కోయబోయాడు. పొద మళ్ళీ రివ్వున ఆకాశంలోకి ఎగిరిపోయింది.

దానితో రాజు కొడుక్కు పట్టరానంత కోపం వచ్చింది. అతడు నౌకర్లను పిలిచి పొలంలో వున్న పంటతోపాటు సర్వం ధ్వంసం చెయ్యమని ఆజ్ఞాపించాడు. దూరాన వుండి రైతులు యిదంతా చూశారు. కాని, యీ దుష్కార్యం చేయిస్తున్నవాడు రాజు కొడుకు కావడంతో, వాళ్ళేమీ అడ్డుకునే ప్రయత్నం చెయ్యలేదు.

రాజు కొడుకు కోటకు తిరిగివచ్చి, తండ్రికి జరిగినదంతా చెప్పాడు. రాజుకు చాలా ఆశ్చర్యం కలిగింది. ఆయన పండితులను సమావేశపరిచి సంగతి చెప్పాడు. కాని, వాళ్ళల్లో ఏ ఒకరూ బంగారు గులాబీ పొద అలా మాయమవడానికి కారణం చెప్పలేకపోయారు.

రాజు కొడుక్కు దాని రహస్యం తెలుసుకోవాలన్న పట్టుదల కలిగింది. అందుకు అతడు ఎన్ని దేశాలైనా తిరిగి, ఆ రహస్యం తెలిసిన వ్యక్తిని కలుసుకోవాలనుకున్నాడు.

అతడు ఆ పనిమీద దేశాటన చేస్తూ, తెలివిమంతురాలని నలుగురూ చెప్పిన ఒక వృద్ధురాలితో, బంగారు గులాబీల పొద గురించి చెప్పాడు. ఆమె అంతా విని, "ఇందులో ఏదో గొప్ప నిగూఢ రహస్యం వున్నది. నువ్వు వెళ్ళే దారిలో

ఒక నగరం వస్తుంది. అక్కడ నీకొక మరుగుజ్జువాడు తారసపడతాడు, అతణ్ణి అడిగిచూడు!'' అన్నది.

వృద్ధురాలు చెప్పినట్టే నగరద్వారం దగ్గిర రాజు కొడుక్కు మరుగుజ్జువాడు కనిపించాడు. అతడు మరుగుజ్జుకు మాయమయ్యే బంగారు గులాబీ పొద గురించి వివరంగా చెప్పాడు.

మరుగుజ్జు తలాడిస్తూ రెండు, మూడు క్షణాలు మౌనంగా వూరుకుని, రాజు కొడుకుతో, ''ఆ రైతుల శ్రమకూ, నిజాయితీకీ గుర్తుగా బంగారు గులాబీలపొద మొలిచింది. ఆ కారణం వల్ల, బంగారు గులాబీలను కోసుకునే హక్కు, వాళ్ళకు తప్ప మరెవరికీ లేదు. ఇందుచేత పరాయి వాళ్ళెవరూ వాళ్ళ పంటపొలాలనుగానీ, గులాబీపొదనుగానీ నాశనం చెయ్యలేరు. పొరుగువాడి సంపదచూసి ఈర్ష్యపడకుండా, ఎవరికి వాళ్ళు శ్రమపడి, ఆ కష్టార్జితంతో తృప్తిగా బతకాలన్నదే, ఇందులో వున్న రహస్యం!'' అన్నాడు.

మరుగుజ్జు యిలా చెప్పగానే రాజు కొడుకు సిగ్గుతో తలవంచుకున్నాడు. తను ఒళ్ళు తెలియని కోపంలో రైతుల పంట పొలాలకు చేసిన హాని అతడికి గుర్తు వచ్చింది.

రాజు కొడుకు మరుగుజ్జుకు తన కృతజ్ఞత చెప్పుకుని, అప్పటికప్పుడే తిరుగు ప్రయాణం అయాడు. ముందూ వెనకా ఆలోచించకుండా తన నౌకర్లచేత రైతులకు కలిగించిన నష్టానికి, వాళ్ళను క్షమాపణకోరి నష్టపరిహారం యివ్వాలని అతడు నిశ్చయించుకున్నాడు.

కొద్ది రోజుల తరవాత రాజు కొడుకు రైతులున్నచోటుకు వచ్చి, అక్కడ కనబడిన దృశ్యం చూసి పరమానందం చెందాడు. తన నౌకర్లు నాశనం చేసిన పంట పొలాలు, పూర్వంలా కళకళ లాడుతూ అతడి కంటబడినై.

బంగారు గులాబీలపొద కూడా యథా స్థానంలో వుండి, చూపరులకు వింత కలిగిస్తున్నది.



# ప్రతాప్ సాహసకృత్యాలు

[అరణ్యంలో అనాధబాలుడుగా, ఒక సిద్ధుడికి దొరికిన ప్రతాప్, అక్కడే పెరిగి చందూ అనే ఒక కోతి, మీనా అన్న ఒక బాలికతో నేస్తం కట్టాడు.]



ప్రతాప్ వున్న అరణ్యం, దారిదోపిడీ దొంగలకు స్థావరం. వాళ్ళు ఒకనాడు దారేపోతున్న తీర్థయాత్రికుల మీద పడి, వాళ్ళ డబ్బూ, నగలూ అపహరించారు.



చెట్టుకొమ్మల చాటున వుండి ప్రతాప్, కోతి చందూ యిది చూశారు. వాళ్ళు చాటుగా దొంగలను వెంబడించారు.



దొంగలు దోచినధనాన్ని ఒక కొండగుహలో దాచి, గుహద్వారానికి ఒక బండరాయిని అడ్డుగా పెట్టి, అక్కణ్ణించి వెళ్ళిపోయారు.



ప్రతాప్ గుహ దగ్గిరకు వెళ్ళాడు. దానికి అడ్డుగా వున్న పెద్ద రాతిని కదిలించడం వాడికి సాధ్యపడ లేదు. కాని, పరీక్షించి చూడగా, రాతికి ఒక పక్కన చిన్న సందు కనిపించింది.



ప్రతాప్ సైగ చేయగానే చందూ, ఆ చిన్న సందులోంచి గుహలోకి పోయింది. అది ధనం వున్న మూట మోయలేక, మూట విప్పి నగలూ మొదలైన వాటిని ఒక్కొక్కటిగా తెచ్చి, ప్రతాప్ ముందు పెట్టసాగింది.



ఈ విధంగా కొంతసేపటికి చందూ దొంగలు దోచిన ధనాన్నంతా బయిటికి చేర్చి, చివరకు మూట కట్టిన వస్త్రాన్ని కూడా తెచ్చి ప్రతాప్‌కు యిచ్చింది.



యాత్రికులు ఆ రాత్రి ఒక పూటకూళ్ళ ఇంట బస చేశారు. తెల్లవారుతూనే, తమకు వచ్చిన ఆపదకు దుఃఖిస్తూ, తిరిగి ప్రయాణమయ్యారు. దారిలో ఒకచోట వాళ్ళకు వెనకనుంచి, "కొంచెం, ఆగండి!" అన్న కేక వినబడింది.



వాళ్ళు ఆగారు. ప్రతాప్ పరుగునవచ్చి వాళ్ళకు ధనం మూట యిచ్చాడు. యాత్రికులకు కలిగిన ఆనందం అంతా యింతా కాదు. వాళ్ళు ప్రతాప్‌కు ఏదైనా బహుమతి యిద్దామనుకునేంతలో, వాడు, వేగంగా వెళ్ళిపోయాడు.



ఒకసారి బందిపోట్లను గురించి ముందుగా హెచ్చరించి గ్రామాన్ని రక్షించినందుకు, గ్రామస్థులు ప్రతాప్‌కు ఒక మంచి గుర్రాన్ని బహూకరించారు.



ఒకనాడు ప్రతాప్ నదిలో స్నానం చేస్తూ, ప్రవాహ వేగానికి ఒక సొరంగంలోకి కొట్టుకుపోయాడు. అక్కడ వాడికి కుప్పలుగా పడివున్న బంగారు కాసులు కనిపించినై. వాటిలో ఒక గుప్పెడు కాసులు తీసుకుని గ్రామస్థులకు పంచిపెట్టాడు.



ఈ సంగతి పిసినారీ, దుష్టుడూ అయిన ఒక భూస్వామికి తెలిసింది. అతడు అతిపేదవాడిలా వేషం వేసుకుని ప్రతాప్ దగ్గిరకు పోయి, సాయం కోరాడు.



ప్రతాప్‌కు అతడి మీద జాలి కలిగింది. వాడు భూస్వామిని వెంటబెట్టుకుని నది దగ్గిరకు పోయి, నదిలో దిగి ఈదుకుంటూ చీకటి సొరంగం కేసి వెళ్ళాడు. తరవాత కొన్ని బంగారు కాసులతో తిరిగివచ్చి, వాటిని భూస్వామికి యిచ్చాడు.



భూస్వామి ఆ స్థలాన్ని బాగా గుర్తుపెట్టుకుని, ఆ రాత్రి నదిలో ఈది సొరంగం ప్రవేశించాడు. కాని, కటికచీకటిలో అతడికి బంగారు కాసులు కనిపించకపోగా, దారితప్పి మరొక సొరంగంలోకి పోయాడు.



తిరిగిపోయేందుకు దారి తెలియక భూస్వామి రెండు రోజులపాటు అక్కడే చిక్కుపడిపోయాడు. తరవాత ప్రాణభీతితో రక్షించండంటూ కేకలు పెట్టసాగాడు. కొండ మీద ప్రతాప్‌తో ఆడు కుంటున్న మీనా ముందుగా ఆ కేకలు విన్నది.



ప్రతాప్ ఆశ్చర్యపోతూ, అక్కడ వున్న ఒక సొరంగ మార్గంలోకి దిగాడు. ఆశపోతు భూస్వామి నిలువెల్లా కంపించిపోతూ, ప్రతాప్ కాళ్ళు పట్టు కుని రక్షించమంటూ ప్రార్థించాడు.



ప్రతాప్‌కు మరొకసారి అతడిపై జాలి కలిగింది. భూస్వామి వాడితో, యిక ఏనాడూ ఆ ప్రాంతా లకు రానని మాట యిచ్చాడు. ప్రతాప్ అతడి కళ్ళకు గంతలు కట్టి, సొరంగ మార్గం నుంచి బయిటికి తీసుకువచ్చాడు.



భూస్వామి, ప్రతాప్ మీద పగబట్టాడు. ఒకనాటి సాయంత్రంవేళ వాడు గుర్రం మీద స్వారీ అయి పోతూండగా, "రక్షించండి!" అన్న కేక వినిపించింది.



ప్రతాప్ అటుకేసి వెళ్ళాడు. హఠాత్తుగా పొదల మాటునుంచి భూస్వామీ, అతడి నౌకర్లూ వాణ్ణి చుట్టుముట్టి పట్టుకున్నారు.



భూస్వామి, ప్రతాప్‌ను తన మిద్దెమీది గదిలో బంధించి, సొరంగంలో బంగారం ఎక్కడ వున్నదో చెప్పకపోతే, ప్రాణాలు దక్కవని బెదిరించాడు.



ప్రతాప్ నేస్తం చందూ యిదంతా గమనిస్తూనే వున్నది. అది రాత్రివేళ ప్రతాప్ గదిపై వున్న పెంకులు లాగి, ఒక తాడును ప్రతాప్ కేసి జార్చింది. దాన్ని పట్టుకుని ప్రతాప్ గదికప్పు మీదికి పాకిపోయాడు.



దిగువునవున్న ఒక స్తంభానికి ప్రతాప్ గుర్రం కట్టి వేయబడివున్నది. చందూ కట్టుతాడును కొరికి తెంచగానే, ప్రతాప్ పైనుంచి గుర్రం మీదికి దూకాడు.



గుర్రం సకిలించడం విని, భూస్వామి, అతడి నౌకర్లూ ఇంటిలోంచి బయిటికి వచ్చారు. వాళ్ళు తమ దారిని అడ్డగించే లోపలే ప్రతాప్, చందూలు శరవేగంతో అరణ్యం చేరారు.



గండం గడిచి స్వేచ్ఛగా అరణ్యం చేరడం ప్రతాప్, చందూలకు చాలా సంతోషం కలిగించింది. ప్రతాప్ కళ్ళనుంచి వెలువడే ఆనంద బాష్పాలను చందూ మృదువుగా తన చేతులతో తుడిచింది.



ప్రతాప్ మర్నాటి సూర్యోదయంవేళ, అరణ్యంలో తనను పెంచి పెద్ద చేసిన సిద్ధుడి సమాధి దగ్గిరకు పోయి భక్తిపూర్వకంగా నమస్కరించి, ప్రార్థిస్తూ నిలబడ్డాడు.



# యువరాజూ - నెమలీ

కొన్నివేల సంవత్సరాల కిందట, దక్షిణ సముద్రంలోని ఒకానొక దీవిలో, రాజొక డుండేవాడు. దీవిలో ఋతువు తప్ప కుండా వానలుకురుస్తూ, యితర సమయాల్లో మంచి సూర్యరశ్మి కారణంగా, ప్రజలు ఆహార సమృద్ధితో సుఖంగా జీవిస్తూండేవాళ్ళు. కాని, రాజు మాత్రం ఎప్పుడూ దిగులుతో కుమిలిపోతూండే వాడు. అందుకు కారణం, ఆయన ఒకే ఒక కుమారుడు మూగవాడు కావడం. ఆ కుర్రవాడు పుట్టి పెరిగిన, యీ పది సంవత్సరాల్లో ఒక్కసారి కూడా మాట్లాడ లేదు.

అదే ద్వీపంలో మరొక ప్రాంతాన పాంగో అనే ఒక యువకుడుండేవాడు. వాడు పరమసోమరి, కాని చాలా తెలివి గలవాడు. వాడు రోజంతా గ్రామంలో తిరుగుతూ, తన మాటకారితనంతో ప్రజలను నవ్విస్తూండేవాడు. అందువల్ల, రోజూ ఏదో యింట వాడి భుక్తి గడిచి పోతూండేది.

ఇలా కొంతకాలం జరిగాక గ్రామస్థులకు వాడి మీద విసుగుపుట్టి, కష్టపడి ఏదైనా పనిపాట్లు చేసుకుని తిండి సంపాయించమని గట్టిగా హెచ్చరించారు. దానితో పాంగో ఆ గ్రామం వదిలి బతుకు తెరువుకోసం బయలుదేరాడు.

వాడు అలా దారిన పోతూండగా మధ్యాహ్నమయింది. ఆకటితో నకనకలాడిపోతూ, వాడు చుట్టూకలయచూశాడు. దాపుల వాడికొక చిన్న ఇల్లు కనిపించింది. వాడా ఇంటికి పోయి తలుపుతట్టాడు.

ఇంటావిడ తలుపు తెరిచి పాంగో ముఖం కేసి చూస్తూనే, ''మంచి ఆకలి మీద వున్నట్టున్నావు, రా భోజనం చేద్దువు గాని,'' అన్నది.



పాంగో ఉత్సాహంగా ఇంట్లోకి వెళ్లాడు. ఇంటావిడ వాడికి అన్నం వడ్డించి, తాను వడ్డించుకుని, ఎదురుగా కూర్చుని ఆ మాటా యీ మాటా చెబుతూ, అక్కడికి సమీపంలోనే వున్న దీవినేలే రాజును గురించి చెప్పింది.

"బాబూ, నువ్వు మన యువరాజు మూగవాడన్న సంగతి వినే వుంటావు. అతడికి మాట తెప్పించినవాళ్ళకు రాజు గారు యివ్వబోయే బహుమానం ఏమిటో తెలుసా ? ఒక గది నిండుగా వున్న పళ్ళూ ఫలాలూ, యితర రుచికరమైన ఆహార పదార్థాలూ; ఇంకొక గదిలో పట్టనంతగా వున్న బంగారం, మరొక గదిలో ఎక్కి తొక్కిగా వున్న రంగు, రంగుల విలువైన వస్త్రాలూ. కాని, ఏం లాభం! యింత వరకూ ఆ బహుమతులు పుచ్చుకున్న వాడే లేడు!" అన్నది ఇంటావిడ.

పాంగోకు రాజుగారి నుంచి ఆ బహుమతులు పుచ్చుకోవాలన్న ఆశ కలిగింది. వాడు అక్కడి నుంచి రాజుగారి దర్శనం కోసం బయలుదేరాడు. కాని, ఎంత ఆలోచించినా యువరాజుకు మాట తెప్పించడం ఎలాగో వాడికి పాలుపోలేదు.

దారిలో వాడికొక బడుగు ముసలివాడు కనిపించాడు. పాంగో ఏనాడూ అంత బక్క చిక్కి వున్న ముసలివాణ్ణి చూసి వుండలేదు. అతడి భుజాన చిన్న ఎండు పుల్లలమోపు వున్నది. పాంగోకు అతణ్ణి చూసి చాలా జాలికలిగింది.

వాడు, ముసలివాణ్ణి సమీపించి, "తాతా, మోపు చాలా బరువున్నట్టున్నది. నా కివ్వు, తెస్తాను," అంటూ పుల్లలమోపు అందుకున్నాడు.

ముసలివాడు, పాంగో కేసి ఆప్యాయంగా చూసి, వాడి పక్కనే నడుస్తూ కబుర్లాడడం మొదలుపెట్టాడు. మాటల సందర్భంలో అతడు, పాంగోను ఎక్కడికి వెళుతున్నావని అడిగాడు.

పాంగో తాను పోతున్న పని చెప్పి, "రాజుగారిచ్చే బహుమానం చాలా విలు



వైనదే. కాని, యువరాజుకు మాటలు తెప్పించడం ఎలాగో, నాకు తెలియడం లేదు," అన్నాడు.

"ఇంతేనా!" అంటూ ముసలివాడు చిన్నగా నవ్వి, "నాయనా, ఒక చిన్న పని చెపుతాను, ఆ విధంగా చెయ్యి. ముందుగా పశుపక్ష్యాదుల్లో, విన్నవాళ్ళకు ఆనంద పారవశ్యం కలిగించే, చక్కని స్వరం ఏ ప్రాణికున్నదో తెలుసుకో. తరవాత, ఆ స్వరం యువరాజు వినేలా చెయ్యి. దానితో అతడికి ఆ స్వరాన్ని అనుకరించ బుద్ధికలిగి గొంతెత్తుతాడు. ఆ విధంగా అతడికి మాటలాడడం అలవడుతుంది," అన్నాడు.

ఈ సలహా యిచ్చి అతడు తన పుల్లల మోపు తీసుకుని, తన దారిన వెళ్ళి పోయాడు.

పాంగోకు యీ సలహా విని చాలా సంతోషం కలిగింది. వాడు నగరం కేసి నడుస్తూండగా, ఒకచోట గడ్డిమేస్తూ. వాడికొక మేకపోతు కంటబడింది. పాంగో దాని దగ్గిరకు పోయి కొమ్ములు పట్టుకుని చిన్నగా కుదిపి, "నిన్ను యువరాజు దగ్గిరకు తీసుకుపోతాను. ఏదీ, నీ పాట వినిపించు!" అన్నాడు.

మేకపోతు తల ఎత్తి, "బా, బా, బే!" అన్నది కర్ణకఠోరంగా.

ఇవి, యువరాజు వినదగ్గ గొంతు కాదు, అనుకుంటూ పాంగో మరి కొంత దూరం వెళ్ళేసరికి వాడికి, ఒక గాడిదా, కోడి పెట్టా, పందీ కనిపించినై. వాడు, వాటిని, "ఒక చిన్న పాట పాడి వినిపించండి!" అన్నాడు.

అవి మూడూ ఉత్సాహంగా గొంతులెత్తి అరిచిన అరుపులు వింటూనే, పాంగో, ఇవీ యువరాజు చెవులబడదగిన స్వరాలు కాదనుకుంటూ, మరి కొంత దూరం నడిచే సరికి, నేల బారుగా వున్న ఒక చెట్టు కొమ్మ మీద బూడిదరంగులో, శరీరం మీది ఈకలన్నీ చిందరవందరగా వున్న ఒక నెమిలి కనిపించింది.

పాంగో నెమిలిని, "నిన్ను యువరాజు దగ్గిరకు తీసుకుపోతాను. ఆయనతో ఏమైనా చెప్పుకుంటావా ?" అని అడిగాడు.

నెమిలి తల పైకెత్తి, వాడికేసి హుందాగా చూస్తూ, "నే చెప్పుకోవలసిందేమీలేదు! నేను గొంతెత్తి పాడడం ప్రారంభిస్తే, అందరూ తన్మయత్వంతో తలలూపవలసిందే," అని పాడటం మొదలుపెట్టింది.

ఆ పాట విని పాంగో అద్భుతం చెందాడు. అది, యువరాజు లాంటివాడు వినవలసిన కంఠస్వరంలా వాడికి తోచింది.

పాంగో సరాసరి రాజు దగ్గిరకు పోయి, "మహారాజా, యువరాజు మూగతనం పోగొట్టే రహస్యం నేను కనుక్కున్నాను. తమరు పోటీ ఏర్పాటు చేసి, గొప్పగా పాడిన వాళ్ళకు మంచి బహుమతి యివ్వండి," అన్నాడు.

రాజు అందుకు ఒప్పుకున్నాడు. పోటీ రోజున రాజూ రాణీతో పాటు వాళ్ళ పరివారం కూడా సమావేశం అయ్యారు. పాంగో, మూగ యువరాజును దాపులనున్న ఒక పొదరింటి చాటుకు తీసుకుపోయి, "ఇప్పుడు జరగబోయే పాటల పోటీలో, నేను లోగడ ఎరిగివున్న మూడు జంతువులూ, రెండు పక్షులూ పాల్గొనబోతున్నవి. నువ్వు వాటి పాటలు విని, అద్భుతంగా వున్నదనుకున్న పాటను అనుకరించి పాడాలి," అని చెప్పాడు.



ముందు గాడిదా, తరవాత మేకపోతూ, కోడిపెట్టా, పందీ ఒక పాట పాడి, అంతటితో వూరుకోక, నాలుగూ కంఠం కలిపి, వినేవాళ్ళు బాధతో చెవులు మూసుకునేలా చేసినై.

అంతవరకూ కొంచెం దూరంగా వుండి వాటి పాటలు వింటున్న బొంత నెమిలి ముందుకు వచ్చి, గొంతెత్తి పాడనారంభించింది. ఆ కంఠస్వర మాధుర్యానికి అక్కడ వున్న వాళ్ళందరూ తన్మయత్వం చెందారు.

ఆ సమయంలో పొదరింటి చాటు నుంచి మూగ యువరాజు గొంతెత్తి, నెమిలిని అనుకరిస్తూ పాటపాడుతూ బయటికి వచ్చాడు. అది చూసి రాజూ, రాణీతో పాటు అందరూ పరమానందం చెందారు. నెమిలి కూడా యువరాజు కంఠస్వరానికి ఆశ్చర్యపోతూ, తాను మరొకసారి పాడబోయింది కాని, దాని గొంతులోంచి ఖిక్ అన్న ధ్వని మాత్రం వెలువడింది.

నెమిలి కోపంగా "మోసం! మోసం! ఎవరో మధురమైన, నా కంఠస్వరాన్ని మాయం చేశారు!" అంటూ దీనంగా కేక పెట్టింది.

రాజు జాలిగా ఒకసారి నెమిలి కేసి చూసి, పాంగోతో, "నువ్వు, యువరాజుకు చేసిన మేలుకు కృతజ్ఞుణ్ణి. అందుకు నీకు తప్పక బహుమానం యిస్తాను. కాని, నువ్వు నెమిలికి చేసిన అపకారానికి దండన తప్పదు. గది నిండుగా వున్న బంగారం, నీకిస్తున్నాను. విలువైన రంగుల దుస్తులు మాత్రం నెమిలివి! ఆ విధంగా, తన శ్రావ్యమైన కంఠస్వరం కోల్పోయినా నెమిలి, పక్షిజాతిలో అత్యంత సౌందర్య రాశిగా కలకాలం వుంటుంది!" అన్నాడు.

ఈ విధంగా అతి పేదవాడైన పాంగో శ్రీమంతుడయ్యాడు, మూగవాడైన యువరాజుకు మాటలు వచ్చినై. బూడిద రంగు వర్ణంతో, కురచ ఈకలతో చూడటానికి ఎబ్బెట్టుగా వుండే నెమిలి, పక్షులకు రాణి అయింది.





## ఛత్రపతి శివాజీ-1

మొగల్ సామ్రాజ్యాన్ని గడగడలాడించిన వీరశివాజీ 1627 వ సంవత్సరంలో జన్మించాడు. శివాజీ తండ్రి షాజీ, బిజాపూర్ సుల్తాన్ ఆస్థానంలో జాగీరుదారుగా వుండేవాడు. అయినా, శివాజీ బాల్యం పూనాలో తల్లి జిజీయాబాయి, కుటుంబ మిత్రుడు దాదాజీ సంరక్షణలో గడిచింది.

బాలుడుగా వున్నప్పుడే శివాజీ అద్భుతమైన ధైర్యసాహసాలను ప్రదర్శించి, దాపునవున్న కొండ ప్రజలైన మావళీల అభిమానానికి పాత్రుడయ్యాడు. క్రమక్రమంగా వాళ్ళు శివాజీని తమ నాయకుడుగా భావించసాగారు.





ధైర్యశాలి అయినప్పటికీ శివాజీలో ఏమాత్రం గర్వం వుండేది కాదు. మత విషయాలపట్ల ఆయనకు చాలా అభిమానం వుండేది. ఆ కాలంలో— ప్రజలలో ఐకమత్యాన్ని, మతాభిమానాన్ని రేకెత్తించిన ప్రముఖ సాధువు రామదాసుపట్ల శివాజీకి ఎనలేని గౌరవాభిమానాలు వుండేవి.



అచిరకాలంలోనే శివాజీ చిన్న సైన్యాన్ని సమకూర్చుకున్నాడు. ఆ సైనికులు శివాజీ పట్ల అచంచలమైన భక్తివిశ్వాసాలను ప్రదర్శించేవారు. వారి సాయంతో శివాజీ బిజాపూర్ సరిహద్దులలో వున్న కోటలనూ, దుర్గాలనూ ఒక్కొక్కదానిగా తన వశం చేసుకోసాగాడు. ఈ విషయం తెలియగానే బిజాపూర్ సుల్తాన్, శివాజీని అణచడానికి తన సైన్యాధికారి అఫ్జల్ ఖాన్‌ను పంపాడు.

అఫ్జల్ ఖాన్ పెద్ద సైనికబలాన్ని శివాజీ సైన్యం చిత్తుచిత్తు చేసింది. ఆఖరికి అఫ్జల్ ఖాన్ శివాజీని ఒక ఏకాంత ప్రదేశంలో కలుసుకోడానికి సమ్మతించాడు. నిర్ణీత సమయానికి అనుకున్న ప్రదేశంలో ఇరువురు ప్రత్యర్థులూ ఎదురెదురుగా రాసాగారు.





శివాజీని కౌగిలించుకోడానికి చేతులు చాచుతున్నట్టు నటించి, అతడి గొంతు నులమ చూశాడు, అఫ్జల్ ఖాన్. కాని ఈ కుట్రనంతా ముందుగానే ఊహించి, అందుకు సిద్ధంగా వెళ్ళిన శివాజీ, తన ఎడమచేతికి తగిలించుకుని వచ్చిన పులిపంజాలాంటి ఇనుప కవచంతో అఫ్జల్ ఖాన్‌ను, కింద పడగొట్టి చంపాడు.

శివాజీ మొగల్ సరిహద్దు ప్రాంతాలను జయించడం ప్రారంభించగానే, ఔరంగజేబు తన సేనానాయకుడైన షయిస్త ఖాన్‌ను, సైన్యంతో శివాజీమీదికిపంపాడు. మహారాష్ట్రుల కోటలను చాలావరకు మళ్ళీ ఆక్రమించిన షయిస్త ఖాన్, పూనాలోని శివాజీ రాజధానిని కూడా పట్టుకున్నాడు. ఒకనాటి రాత్రి జరిగిన పెళ్ళి ఊరేగింపుతో, శివాజీ, అతని అనుచరులూ షయిస్త ఖాన్ శిబిరం కేసి బయలుదేశారు.





శివాజీ, ఇరవైమంది అతని అనుచరులూ, హఠాత్తుగా శిబిరం మీదికి దాడి జరిపారు. దూసిన కత్తితో శివాజీ, షయిస్త ఖాన్ వున్న గది లోపలికి జొరబడ్డాడు. అతణ్ణి చూడగానే మొగల్ సైన్యాధిపతి కిటికీగుండా పారిపోయాడు. కాని, అతని చేతిలోని మూడు వేళ్ళు శివాజీ కత్తివేటుకు తెగిపోయాయి.

ఔరంగజేబు పక్షం నుంచి రాజా జైసింగ్, శివాజీతో రాజీరాయబారాలు నడిపాడు. సకలవిధ రక్షణా సమకూరుస్తామన్న హామీతో చర్చలు జరపడానికి సగౌరవంగా శివాజీని ఆగ్రాకు ఆహ్వానించాడు జైసింగ్. తన కుమారుడు శంభూజీతో కలిసి శివాజీ ఆగ్రా చేరాడు. అక్కడ ఆయనకు సరైన గౌరవం చూపకపోయేసరికి ఎదురు తిరిగాడు.





తండ్రి కొడుకులు ఒక ఇంట్లో బంధించ
బడ్డారు. రక్షణ ఏర్పాట్లన్నీ పకడ్బందీగా
ఏర్పాటు చేశారు. తన బలమైన
శత్రువు దొరికిపోయాడని ఔరంగజేబు
పరమానందం చెందాడు. శివాజీ జబ్బు
పడ్డట్టు నటిస్తూ, పుణ్య కార్యంగా
పెద్ద సంచీలలో తినుబండారాలను
పేదలకు పంచడానికి పంపుతూ వుండే
వాడు. రోజు రోజుకీ ఈ సంచీల సంఖ్య
ఎక్కువ కాసాగింది.

ఒకనాడు శివాజీ, శంభూజీ తినుబండా
రాల సంచీలలో చేరి ఖైదునుంచి
బయటపడ్డారు. అలవాటు ప్రకారం
కాపలావాళ్ళు ఆ మూటలను బయటకు
పంపడానికి అడ్డు చెప్పలేదు. ఔరంగ
జేబుకు ఈ విషయం ఆలస్యంగా తెలియ
వచ్చింది.






సన్యాసులవేషం ధరించి, తండ్రి
కొడుకులు ఆగ్రా వదిలారు. నగర పొలి
మేరల్లో శివాజీ అనుచరులు గుర్రాలతో
సిద్ధంగా వున్నారు.కొన్ని రోజులలో శివాజీ,
శంభూజీ పునాలో వున్న తన పరి
వారాన్ని చేరుకున్నారు. శివాజీని శాంత
పరచి మంచి చేసుకోడం కోసం,
ఔరంగజేబు అతనికి 'రాజా' అన్న
బిరుదు యిచ్చాడు.

# ప్రత్యక్ష సలహా!

కిష్టయ్య మంచి వయసులో వున్నవాడు. కండలు తేరినదేహం, బుంగమీసాలతో, చూసేవాళ్ళకు యమకింకరుణ్ణి జ్ఞప్తికి తెచ్చేవాడు. అతడు తానున్న గ్రామంలో కూరగాయలు పండించి, వాటిని స్వయంగా పట్నం తీసుకుపోయి అమ్ముకొస్తూండేవాడు. ఒకసారి అతడు పట్నంలో కూరగాయలమ్మి, డబ్బు సంచీ రొండిన కట్టుకుని, తిరుగుప్రయాణం అవుతూండగా, అతడి స్నేహితుడొకడు, "కిష్టయ్యా, రోజులు బాగాలేవు. నలుగురికంటా పడకుండా, డబ్బుసంచి దుస్తుల్లో దాచెయ్యి," అని సలహాయిచ్చాడు. కిష్టయ్య మీసం మెలివేసి, "నా దగ్గిరే డబ్బు దొంగతనమా!" అని, గ్రామానికి బయలుదేరాడు.

దారిలో అతడికి దాహం వేసింది. అక్కడ కనబడిన బావిలో దాహం తీర్చుకుని, పక్కనే వున్న సత్రం అరుగుమీద బడలిక తీర్చుకునేందుకు కూర్చున్నాడు. ఆ సమయంలో బక్కచిక్కిన వాడు అతడి దగ్గిరకువచ్చి, "బడలిక పోతుంది; ఒళ్ళు పట్టమంటారా?" అన్నాడు.

కిష్టయ్య సరేనన్నాడు. బక్కవాడు అతడి ఒళ్ళుపడుతూ, మెడదగ్గర ఏవోనరాలు ఒత్తి, కిష్టయ్య స్పృహకోల్పోయేలా చేశాడు.

అరగంట తర్వాత కిష్టయ్యకు తిరిగి స్పృహవచ్చింది. అతడు గాభరాపడిపోతూ డబ్బుసంచీ కోసం వెతుకుతూండగా "బక్కవాడు వచ్చి, అయ్యా, ఇదుగో మీ డబ్బుసంచీ! డబ్బు సరిగా వున్నదో లేదో లెక్కపెట్టుకోండి. పట్నంలో డబ్బు సంచీ గురించి మీకు సలహా యిచ్చిన స్నేహితుడి పేరేమిటో నాకు తెలియదు. నన్ను సలహాల సాంబయ్య అంటారు. నేనిచ్చే వన్నీ ప్రత్యక్షసలహాలే!" అన్నాడు.

కిష్టయ్య నవ్వుకుని, వాడికి ఒక వరహా బహుమానంగా యిచ్చాడు. —ఆర్. రేవతి






# చింతపండు మూట

ఒక గ్రామంలో ఒక వర్తకు డుండేవాడు. అతని కుటుంబం పెద్దదీ, చేసే వ్యాపారం చిన్నదీనూ. అందుచేత ఆతను సాధ్యమైనంతవరకు చిల్లిగవ్వ కూడా వృథాగా ఖర్చు చెయ్యకుండా అమితజాగ్రత్తగా కాలక్షేపంచేస్తూ ఉండేవాడు.

ఆతను అప్పుడప్పుడు బస్తీకి వెళ్ళి, తనకు కావలసిన సరుకులు కొనుక్కునేవాడు. కాని, వాటిని బండిమీద వేయించి, రాజవీధిన తెచ్చేవాడు కాడు. ఎందుకంటే రాజవీధి మీద సుంకాల చావడి ఉన్నది. ఆ వీధిన సరుకు తీసుకుని ఊరు దాటి వెళ్ళేవాళ్ళు అక్కడ సుంకం చెల్లించుకోవాలి. ఆ సుంకం డబ్బులూ, బండి కిరాయి డబ్బులూ ఆదా అవుతాయి గదా అని, వర్తకుడు బస్తీలో తాను మోయగలిగినంత సరుకు మాత్రమే కొని, గోతం సంచీలో వేసుకుని, చుట్టదారిన అడవి మార్గంగా తన గ్రామానికి మోసుకుపోతూండేవాడు.

అరణ్యమార్గాన దూరం హెచ్చుకావటమేగాక, దారిలో దొంగలభయమూ, క్రూరమృగాల భయమూ కూడా జాస్తి. అరణ్యంలో పిశాచా లుంటాయని కూడా జనం చెప్పుకునేవారు. అయినా వర్తకుడు అన్నిటికీ గుండె రాయి చేసుకుని ఆ దారినే వెళ్ళేవాడు.

ఒకసారి వర్తకుడు ఇలాగే సరుకు మోసుకుని అరణ్యమార్గాన తన గ్రామానికి వస్తుండగా, ఒక మర్రిచెట్టు మీది నుంచి ఒక పిశాచం అతని ముందు గభాల్న దూకి, "నిన్ను మింగేస్తా!" అంటూ మీదికి వచ్చింది.

క్షణంపాటు బెదిరిపోయిన వర్తకుడు వెంటనే ధైర్యం తెచ్చుకుని, "ఓస్, పిశాచానివా? ఇంకా దబ్బనంగాడేమోనని

హడలిపోయా!" అన్నాడు పిశాచమంటే భయం లేనివాడిలా.

ఈ మాట విని పిశాచానికి వల్లమాలిన ఆశ్చర్యం పుట్టుకొచ్చింది. ఈ మనిషికి పిశాచాలంటే భయం లేదుగాని, దబ్బనం గాడంటే భయమా?

"ఎవడా దబ్బనంగాడు? ఎప్పుడూ వినను కూడా లేదే! వాడు నా కన్న భయంకరుడా? ఎక్కడుంటాడు వాడు?" అన్నది పిశాచం.

"దబ్బనంగాడు సాధారణంగా ఈ అరణ్యప్రాంతంలో ఉండడులే. అయినా వాడి జోలికి పోమాకు. నువ్వంటే కేవలమూ పిశాచానివి. నా బోటివాళ్ళను అమాంతంగా మింగెయ్యటమే నీకు చాతన వును. దబ్బనంగా డలా కాదే! వాడు పొడిచి, పొడిచి చిత్రవధ చేస్తాడు. వాడు మహా దుర్మార్గుడు," అన్నాడు వర్తకుడు.

తన ఎదట ఆ వర్తకుడు భయంతో వణికి మూర్ఛపోకపోగా, ఇంకెవరినో దబ్బనంగాణ్ణి గురించి చెప్పి తనను భయ పెడుతుంటే పిశాచానికి కోపం వచ్చింది.

"నాకా దబ్బనంగాణ్ణి తక్షణం చూపించు," అన్నది పిశాచం.

"వాడెక్కడో ఊరి మధ్య ఉంటాడు. నిన్ను వాడు చూశాడంటే నిన్నూ, నన్నూ కూడా చంపేస్తాడు. అందుచేత నా గోతంలో నిన్ను మూట గట్టి, దబ్బనంగా డుండే చోటికి తీసుకుపోతాను. నువు మాత్రం గోతం సందుల్లో నుంచి చూస్తూ



ఉండు గాని కిక్కురుమనకు,'' అన్నాడు వర్తకుడు.

అతను తన గోతంలో ఉన్న వస్తువులన్నీ తీసేసి, దయ్యాన్ని అందులో కూర్చొబెట్టి, గోతం మూత బిగించి కట్టి, భుజాని కెత్తుకుని ఊరి దారి పట్టాడు. అతను రాజవీధిన సుంకాల చావడి దాటి ఏమీ ఎరగనట్టు ముందుకుపోతుంటే, ''ఏయ్, ఆగు! ఏముందా మూటలో?'' అని సుంకాలు వసూలు చేసేవాడు అడిగాడు.

వర్తకుడు మూట దించి, ''చింతపండండి,'' అన్నాడు.

సుంకాధికారి మూటను కాటా వేయిస్తూ దబ్బనంతో నాలుగైదు చోట్ల పొడిచి, ''చింతపండు లాగే వుంది. నాలుగు మణుగులు బరువుంది. నాలుగు పావలాలు, ఒక రూపాయి, సుంకం కట్టు,'' అన్నాడు.

వర్తకుడు రూపాయి చెల్లించి, మూట మళ్ళీ ఎత్తుకుని మరొక దారిన అరణ్యంలో తన సామానున్న చోటికి చేరి, గోతం మూతి విప్పి దయ్యాన్ని విడుదల చేసి, ''చూశావా, దబ్బనంగాడి తడాఖా? నేను రూపాయి ఇచ్చాను గనక నువు ప్రాణాలతో బయటపడ్డావు,'' అన్నాడు.

''అబ్బ, పొడిచి పొడిచి చంపాడు. నువు చింతపండని అబద్ధం చెప్పబట్టి బతికిపోయాను. నీకేం ఉపకారం కావాలో కోరుకో,'' అన్నది పిశాచం.

''పెద్ద కుటుంబం గలవాణ్ణి. చాతయితే ధనం ఇప్పించు,'' అన్నాడు వర్తకుడు.

''దానికేం భాగ్యం? ఈ చెట్టు మొదట్లో చాలా ధనం పాతిపెట్టి ఉంది. తవ్వుకో,'' అంటూ దయ్యం ఎగిరి చెట్టు మీదికి వెళ్ళింది.

వర్తకుడు చెట్టు మొదట తవ్వగా బోలెడంత ధనం దొరికింది. దాన్ని మూటలో వేసుకుని, అరణ్యమార్గానే తన గ్రామం చేరి, ఆ డబ్బుతో అతను హాయిగా జీవించాడు.





# భ్రమ తొలగింది

ఆదిత్య పాతికేళ్ళ యువకుడు; సహజంగా ధైర్యవంతుడు. అతడికి ప్రతి రాత్రీ భోజనం చేశాక, ఊరి వెలపల వున్న చెరువు కట్టదాకా నడిచి, తిరిగి రావడం అలవాటు. ఆ ప్రాంతాలే శ్మశానం వున్నది. అయినా, అతడికి దయ్యాల గురించిన భయం ఏమీలేదు.

మామూలుగానే ఒకనాటి రాత్రి అతను చెరువు కట్టదాకాపోయి తిరిగి వస్తూండగా, శ్మశానానికి దాపుల ఎవరో యిద్దరు గట్టిగా పోట్లాడుకోవడం కనిపించింది. ఎవరై వుంటారు వాళ్ళు అనుకుంటూ ఆదిత్య అటుకేసి నడిచి, కొంచెందూరం నుంచే, "ఇంత అర్ధరాత్రి వేళ, ఎందుకా పోట్లాట?" అన్నాడు.

ఆ వెంటనే పోట్లాడుకుంటున్న వాళ్లలో ఒకడు, "ఎవరో మనిషిలాగుంది! ఇంత రాత్రివేళ యిటుకేసి ఒంటరిగా వచ్చాడంటే, నిజంగానే ధైర్యవంతుడై వుండాలి. పద, మన తగువు అతడు తేల్చగలడేమో చూద్దాం," అన్నాడు.

ఆదిత్య వాళ్ళను సమీపించేంతలో, రెండు నల్లని ఆకారాలు గబగబా అతడి ముందుకు వచ్చి నిలబడినై. అవి దయ్యాలు! ఆదిత్య ఒకక్షణం నివ్వెరపోయి, అంతలోనే ధైర్యం తెచ్చుకుని, "మీరేనా పోట్లాడుకుంటున్నది?" అని అడిగాడు.

"అవును, మేమే! మమ్మల్ని చూస్తూంటే భయం కలగడం లేదా? ఎవరనుకున్నావు, మేం దయ్యాలం," అన్నదొక ఆకారం.

ఆదిత్యకు లోపల భయంగా వున్నా, పైకి ఎంతో ధీమాగా, "ఆ సంగతి చెప్పకుండానే తెలుస్తున్నది. నాకేం భయం లేదు. చిన్నప్పుడు మీలాంటి వాళ్ళను



మాచిరాజు కామేశ్వరరావు





వీధి నాటకాల్లో చూశాను, ఆ తరవాత యిప్పుడు యీ శ్మశానం దగ్గిర చూస్తున్నాను,'' అన్నాడు.

''నీ గుండెనిబ్బరం మెచ్చదగింది. అయితే, మా తగువొకటి తీర్చాలి,'' అన్నదొక దయ్యం.

''ఏమిటా తగువు ?'' అని అడిగాడు ఆదిత్య.

''ఇక్కడికి దగ్గిరలోనే, ఒక ఇంటి డాబా మీద అప్సరసలాంటి అమ్మాయి ఒకతె నిద్రపోతున్నది. ఆ అమ్మాయి ఒంటిరంగు మేలిమి బంగారువర్ణం అని ఒకళ్ళం, కాదు గులాబీరంగని ఒకళ్ళం వాదించుకుంటున్నాం. నువ్వు, ఆ అమ్మాయిని స్వయంగా చూసి, మాలో ఎవరి మాట నిజమో తేల్చి చెప్పాలి,'' అన్నవి దయ్యాలు.

నేరక యీ దయ్యాల గొడవలో చిక్కుకున్నానే, అని మనసులో అనుకుంటూ, చేసేదిలేక ఆదిత్య సరేనంటూ తల ఊపాడు.

దయ్యాలు అతణ్ణి, అవి చెప్పిన అమ్మాయి నిద్రపోతున్న డాబా దగ్గిరకు తీసుకుపోయాయి. ఒక పెద్ద చెట్టుకొమ్మ, ఆ డాబా పైకి ఒరిగి వున్నది. దయ్యాలతో పాటు, ఆదిత్య కూడా, ఆ చెట్టుకొమ్మ మీదికి పాకుతూ పోయి, డాబా పైభాగాన దిగాడు.

గుడ్డివెన్నెల కాంతిలో అక్కడ మంచం మీద నిద్రపోతున్న అమ్మాయిని చూసి, ఆదిత్య ఆశ్చర్యంలో మునిగిపోయాడు. అంత గొప్ప సౌందర్యవతిని, యీనాటి వరకూ అతను చూసి వుండలేదు. వివాహమాడితే, ఆ అమ్మాయిని తప్ప, మరెవర్నీ వివాహమాడకూడదనుకున్నాడు.

ఆదిత్య ఆమె కేసి కన్నార్పకుండా చూస్తూండగా, దయ్యాలు రెండూ చప్పున చెట్టుకొమ్మ పట్టుకుని, కిందికి పోసాగినై. ఆ సమయంలో అయిన అలికిడికి, ఆ అమ్మాయి కళ్ళు తెరిచి ఆదిత్యను చూసి కెవ్వుమన్నది.







అదిత్య నవ్వుతూ, "భయపడకు! నేను దొంగను కాదు, దయ్యాన్ని అంత కన్నా కాదు," అన్నాడు.

"అయితే, యింత అర్ధరాత్రి వేళ, నీ కిక్కడేం పని?" అని ఆ అమ్మాయి కోపంగా అడిగింది.

అదిత్య ఆమెకు తను రావడానికి కారణం ఏమిటో చెప్పి, "ఆ దయ్యాలు చెప్పినదాంట్లో అబద్ధం ఏమీ లేదు. నీది అపూర్వమైన అందం! నా కిక్కడ మంచి ఉద్యోగమే వుంది. నేను, నిన్ను పెళ్ళాడా లనుకుంటున్నాను. తెల్లవారగానే వచ్చి, మీ వాళ్ళతో మాట్లాడతాను," అన్నాడు సంతోషంగా.

ఆ మాటలతో ఆమె కళ్ళింత చేసి, పళ్ళు కొరుకుతూ, "నీ కెంత పొగరు! నన్ను పెళ్ళి చేసుకుంటావా? నా అందం చూశాక, ఆ మాట అనేందుకు, నీ కెలా ధైర్యం వచ్చింది? ఎప్పుడైనా, నీ కోతి మొహాన్ని అద్దంలో చూసుకున్నావా? నీకు తగినశాస్తి జరగాలి," అని, పెద్దగా గొంతెత్తి, "అన్నయ్యా, అన్నయ్యా, దొంగ!" అంటూ కేక పెట్టింది.

ఆమె మాటలు ఆదిత్యకు గుండెల్లో శూలం పోట్లులా తగిలినై. అవమానంతో కుంగిపోయిన అతడికి పారిపోవాలన్న ఆలోచనే రాలేదు.

ఇంతలో వస్తాదులా వున్న వాడొకడు, దుడ్డుకర్ర చేతపట్టుకుని, "దొంగా! ఎక్కడ?" అంటూ డాబా మీదికి వచ్చి, ఆదిత్యను చూసి, "దొంగవెధవా, కావా లనుకుంటే నిన్ను, ఈ క్షణమే డాబామీది నుంచి కిందికి గిరవాటు వేయగలను. దయతలిచి వదులుతున్నాను. నిన్ను, ఈ రాత్రికి చీకటికొట్లో వేసి తెల్ల వారాక పదిమందిలో నిలబెట్టి, నీకు తగిన బుద్ధి చెబుతాను," అన్నాడు కోపంగా.

ఆదిత్య భయంతో, అవమానంతో వణికి పోతూ, "నేను దొంగను కాదు!" అన్నాడు.







ఆ జవాబుకు ఆమె యీసారి పెద్దగా నవ్వుతూ, "దొంగల్లో యింత కురూపి వాణ్ణి యింతవరకూ చూడలేదు," అన్నది.

వస్తాదు, అతణ్ణి చేయి పట్టుకుని, డాబా మెట్ల మీదినుంచి కిందికి లాక్కుపోయి, అక్కడ ఒక చీకటి కొట్లోకి తోసి, బయట గొళ్ళెం పెట్టాడు.

ఆదిత్యకు, యీ జరిగినదంతా ఒక కలలా తోచింది. ఆ మిగిలిన రాత్రంతా అతడికి నిద్రలేదు. తెల్లవారుతూండగా దూరం నుంచి కోళ్ళ కూతలూ, దాపుల నుంచి కాకుల అరుపులూ వినిపించాయి.

అతడు మతిపోయినవాడిలా మూసిన తలుపులను బాదుతూ, "నేను దొంగను కాదు, తలుపులు తెరవండి!" అంటూ అరవసాగాడు.

కొంతసేపటికి తలుపులు తెరుచుకున్నవి. ఆ తెరిచింది, తాను చేసుకుందామనుకున్న అందాల అమ్మాయి కాదు; ఆవిడ అన్న వస్తాదూ కాదు, ఎవరో నలుగురు కూలిపనివాళ్ళు.

వాళ్ళు, ఆదిత్య చీకటిగది నుంచి బయిటికి రాగానే, అతడి కేసి ఆశ్చర్యంగా చూస్తూ, "ఏనాడో పాడుపడిపోయిన, యీ దయ్యాల కొంపలోకి నువ్వెలా వచ్చావు? నయం, అవి నిన్ను పీక్కు తినలేదు!" అన్నారు.

ఆదిత్య తల వంచుకుని యిల్లు చేరాడు. అతడికి, తనను అంతగా అవమానాలపాలు చేసిన రెండు దయ్యాల మీద పగ తీర్చుకోవాలనిపించింది. చీకటి పడి, కొంత పొద్దుపోయాక, ఒక లావుపాటి కర్ర తీసుకుని, గతరాత్రి దయ్యాలు కనిపించిన చోటుకు వెళ్ళాడు.

దయ్యాలు రెండూ అక్కడ కూర్చుని వున్నవి. అవి ఆదిత్యను చూస్తూనే పొట్ట చెక్కలయేలా నవ్వి, "నువ్వు వస్తావని మాకు తెలుసు! మీ మనుషులు పట్టుకు తిరిగే దుడ్డుకర్రలూ, బాణాకర్రలూ మాకు పూచికపుల్లలతో సమానం," అన్నవి.





"అలాగా! ఆ సంగతి తరవాత తెలుస్తుంది! రాత్రి మీ యిద్దరూ, మరికొన్ని తోటి దయ్యాలూ కలిసి, అంత పెద్ద నాటకం ఎందుకాడారు? నాకు అవమానం, శరీర కష్టం కూడా ఎందుకు కలిగించారు?" అని అడిగాడు ఆదిత్య, బాణా కర్రను భుజం మీద పెట్టుకుంటూ.

దయ్యాలు రెండడుగులు వెనక్కు వేసి, "అది మామూలు నాటకంకాదు, వీధి నాటకం. నీకు బుద్ధి చెప్పేందుకు, ఆ పని చేశాం. అంజని ఎవరో తెలుసా? ఆ పిల్ల ఊరునుంచి, పనిగట్టుకుని యిక్కడికి వచ్చాం," అన్నవి.



"అంజనా? తెలియకేం? ఆమె నా మేనమామ కూతురు," అన్నాడు ఆదిత్య తెల్లబోతూ.

"ఆ పిల్ల పేరు యింకా గుర్తుందన్న మాట! నీ యిష్టం మీదే, ఆ పిల్లతో నీ పెళ్ళి ఎప్పుడో నిశ్చయం అయిపోయింది గదా. నీకు ఉద్యోగం దొరికి యీ పట్నం, పల్లెకాని ఊరు చేరాక, నలుగురు అందగత్తెల్ని చూడగానే, అంజని నీ దృష్టిలో కురూపి అయిపోయింది. అవునా?" అన్నవి దయ్యాలు.

ఆదిత్య జవాబు చెప్పేందుకు ఏమీ తోచక తల వంచుకున్నాడు. దయ్యాలు రెండూ వికటంగా నవ్వి, "నీ అందం ఏపాటిదో, రాత్రి ఆ అందగత్తె చెప్పింది కదా! వారం రోజుల క్రితం పెళ్ళి విషయం మాట్లాడేందుకు వచ్చిన, మీ మేనమామతో, అంజని అందగత్తెకాదనీ, ఆమెను పెళ్ళాడననీ తేల్చి చెప్పేశావు. పాపం, ఆ పిల్ల దుఃఖం ఏమనుకున్నావు!" అన్నవి.

ఆ మాటలతో, యీ మధ్య కొంత కాలంగా అతణ్ణి పట్టి పీడిస్తున్న భ్రమలన్నీ తొలగిపోయాయి. అందరూ కాకపోయినా, ఒక్కొక్క అందగత్తె మనస్సు రక్కసికి స్థావరంకావచ్చు: అలాగే ఒక్కొక్క కురూపి మనస్సు దేవతకు నివాసం కావచ్చు. తను చేసిన నేరం

ఏమీ లేకపోయినా, డాబా మీద ఆ అంద గత్తె తనను ఎంతగా అవమానించింది! ఎంత బాధకు గురి చేసింది!

ఆదిత్య యిలా కొద్దిసేపు మథనపడి, దయ్యాలతో, "మీ కారణంగా, నేను పగటికలల నుంచి బయటపడ్డాను. మనిషి రూపంకన్న, మనసు ముఖ్యం. రేపు తెల్లవారుతూనే, మా గ్రామం వెళ్ళి, మా మేనమామతో అంజనికీ, నాకూ పెళ్ళిముహూర్తం పెట్టించవలసిందిగా చెపుతాను," అన్నాడు.

"మంచిమాట! ఇక మా ఊడలమర్రికి వెళతాం," అంటూ దయ్యాలు రెండూ చీకట్లో కలిసిపోయినై.

మర్నాడు ఆదిత్య తన ఊరు చేరి, మేనమామతో తాను అంజనను పెళ్ళాడ దలచినట్టు చెప్పాడు. ఆయనకూ, అంజనికీ కలిగిన ఆనందం అంతా యింతా కాదు.

పది రోజుల తరవాత ఆదిత్యకూ, అంజనికీ వివాహం జరిగిపోయింది. రాత్రికి మేనమామ పెళ్ళికి వచ్చిన బంధు గణం కోసం, వీధిభాగవతుల చేత ఒక నాటకం ఏర్పాటు చేశాడు.

నాటకం ప్రారంభం కాగానే, రక రకాల వేషాలు ధరించి తెర ముందుకు వచ్చిన ముగ్గురు మగవాళ్ళనూ, అందంగా అలంకరించుకుని వచ్చిన ఒక స్త్రీనీ చూసి, ఆదిత్య ఉలిక్కిపడి మేనమా మతో, "మామయ్యా, వీళ్ళు మనుషులు కాదు, దయ్యాలు!" అని, కొన్నాళ్ళ క్రితం తనకు ఉద్యోగం చేస్తున్న ఊళ్ళో జరిగిన అనుభవం గురించి నాలుగు మాటల్లో చెప్పాడు.

మేనమామ చిన్నగా నవ్వి, "అవునురా, ఆదిత్యా, నువ్వు చెప్పింది నిజం. ఇవి, వీధి నాటకాలు ఆడనేర్చిన దయ్యాలు! వీటి సాయంతోనే నేను, నీ భ్రమలన్నీ తొలగించాను," అన్నాడు.

ఆ జవాబుతో ఆదిత్యకు జరిగిందేమిటో అర్థమైంది. అతడు సంతోషంతో చిన్నగా నవ్వుకున్నాడు.





# హామీపత్రం

భరణీధరుడనే యువకుడు గురుకులంలో విద్యాభ్యాసం ముగించుకుని, సొంత ఊరు తిరిగివచ్చాడు. అతను తెలివైనవాడనీ, నెమ్మదస్తుడనీ విన్న సుందరదత్తు అనే వ్యాపారి అతడికి తన వద్ద పద్దులెక్కలు రాసే ఉద్యోగం యిచ్చాడు. మూడు నెలలు అక్కడ పని చేసేటప్పటికి భరణీధరుడికి పద్దులు రాయడంలోని మెలకువలన్నీ తెలిశాయి.

ఆ ఊరిలో అశోకమిశ్రు డనే మరొక వ్యాపారి వున్నాడు. అతడికీ, సుందరదత్తుకూ వ్యాపారం విషయంలో పెద్ద పోటీ వుండేది. భరణీధరుడు మంచి చురుకైనవాడే కాక, నమ్మకస్థుడని తెలుసుకున్న అశోకమిశ్రుడు, అతడి దగ్గిరకు తన మనిషిని పంపి, సుందరదత్తు యిచ్చేదాని కన్న నూరు వరహాలు ఎక్కువ జీతం యిస్తానన్నాడు.

భరణీధరుడు వారం రోజుల్లో సుందరదత్తు దగ్గిర ఉద్యోగం మాని, అశోకమిశ్రుడి దగ్గిర చేరాడు.

ఆ ఊరి జమీందారు కృష్ణంరాజు గారికి, తన దివాణం లెక్కలు చూసే అతడికి సహాయకుడు ఒకడు కావలసి వచ్చాడు. ఆయన భరణీధరుణ్ణి పిలిపించి, అశోకమిశ్రుడు యిస్తున్న జీతం ఎంత అని అడిగాడు. రెండు వందల వరహాలన్నాడు, భరణీధరుడు.

''రెండు వందల వరహాలా! చాలా తక్కువ. నేను నాలుగు వందల వరహాలిస్తాను. మా దివాణంలో చేరు,'' అన్నాడు జమీందారు.

భరణీధరుడు దివాణంలో పనికి కుదిరాడు. రెండు, మూడు నెలలు గడిచినై. ఒకనాడు అతడి చిన్ననాటి స్నేహితుడు ధర్మరాజు అనేవాడు కనిపించి,


ఎస్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి


''నేను వస్తువుల ఎగుమతీ, దిగుమతీ లాంటి, మంచి లాభసాటి వ్యాపారం చేస్తున్నాను. నాతో భాగస్వామిగా చేరు. మంచి ఆదాయం వస్తుంది,'' అన్నాడు.

''నాకు సొంతాన వ్యాపారం అంటే యిష్టం లేదు,'' అన్నాడు ధరణీధరుడు.

''అలా అయితే, నా వ్యాపారంలో లెక్కలుచూస్తూ చేదోడు వాదోడుగా వుండు, నీకు జమీందారు యిచ్చేదానికి రెట్టింపు జీతం యిస్తాను,'' అన్నాడు ధర్మరాజు.

ధరణీధరుడు దివాణం ఉద్యోగం మానుకుని, ధర్మరాజు దగ్గిర చేరాడు. నెల తిరక్కుండానే ధర్మరాజు చేసే వ్యాపారం దొంగవ్యాపారమని అధికారులు అతణ్ణి పట్టుకుని, ఖైదుకు పంపారు.

ఈసారి ధరణీధరుడు ఉద్యోగం కోసం ఎవరూ పిలవకపోవడంతో, తానే ప్రయత్నించవలసి వచ్చింది. కాని, ఎవరూ అతడికి ఉద్యోగం యివ్వలేదు.

అతడు తిరిగి, తిరిగి వేసారి పక్క గ్రామంలో వున్న మేనమామ శివస్వామి అనే చిన్న భూస్వామి దగ్గిరకు పోయి సంగతి చెప్పుకున్నాడు.

ఆయన అంతా విని, ''ఎవరు నాలుగు డబ్బులు ఎక్కువ ఆశచూపితే, వాళ్ళ దగ్గిరకు పరిగెత్తే నిలకడలేని నీబోటి వాడికి ఎవరు ఉద్యోగం యిస్తారు?'' అన్నాడు.

''అలా కాదు, మామయ్యా. ఇకనుంచి నేను ఎలాంటి ప్రలోభాలకూ లోను కాను. కుదురుగా ఉద్యోగంలో వుంటానని హామీ పత్రం రాసి యిస్తాను.'' అన్నాడు ధరణీధరుడు దీనంగా.

మర్నాడు శివస్వామి, మేనల్లుణ్ణి వెంటబెట్టుకుని జమీందారు దగ్గిరకు వెళ్ళి, జరిగింది చెప్పి, ''ఇకనుంచి నిలకడగా వుంటానంటున్నాడు. కావాలంటే హామీ పత్రం కూడా యివ్వగలడు,'' అన్నాడు.

''అలాంటిదేం అవసరం లేదు. మీ వాడి జీవితానుభవమే, మాకు హామీ పత్రం!'' అని జమీందారు ధరణీధరుడికి దివాణంలో తిరిగి ఉద్యోగం యిచ్చాడు.





# విష్ణుకథ

లక్ష్మిదేవి వేదవతిగా అవతరించి తపస్సు చేస్తున్నప్పుడు రావణుడు కొప్పు పట్టుకున్న కారణంగా యోగాగ్నితో ఆమె దహించుకుపోయి లంకలో పుట్టింది.

లంకా పట్టణాన్ని అనుసరించుకొని అందమైన గొప్ప సరోవరం ఉన్నది. ఎప్పటిలాగే ప్రాతఃకాలాన్నే రావణుడు ఆ సరోవరంలో స్నాన సంధ్యలువార్చి శివార్చనకు తామరపువ్వుల్ని ఏరుతూండగా, ఒక పెద్ద తామర పువ్వు సరోవర మధ్యంలో ధవళకాంతుల్ని ప్రసరిస్తూ కనుపించింది. దాని దగ్గరికి చేరుతూండగా ఆ పువ్వులో బంగారంలాగ మెరిసిపోతున్న అందమైన స్త్రీశిశువు క్యారుమంటూ కనిపించింది.

ఆ పసిపిల్లను చూసి రావణుడు ముచ్చట పడుతూండగా అశరీరవాణి, ''ఓ రావణా! ఆ బిడ్డ నీకూ, నీ లంకకూ చేటుగా పుట్టిన బిడ్డ!'' అని వినిపించింది.

రావణుడు రాక్షసవీరభటులకు ఆ పసిపాపను చంపి రండని ఉత్తరువు చేశాడు.

ఆ పసిపాప ఏం చేసినా చావలేదు. కత్తులు అదృశ్యమైనాయి. అగ్ని ఆరిపోయింది. రాతిబండలు పూలకుప్పలైనాయి. క్రూరమృగాలు పారిపోయాయి.

రాక్షసులు విసిగి ఆ పిల్లను పంచలోహాలతో చేసిన పెట్టెలో పెట్టి గట్టిగా బంధించి సముద్ర మధ్యంలో పడవేశారు.

ఆ పెట్టె సముద్రాన్ని దాటి భూమిని చీల్చుకొని భూగర్భంలోకి అలా వెళ్ళింది.

11. సీతారామ కళ్యాణం



మిథిలా రాజ్యాన్నేలే జనకమహారాజు గొప్పజ్ఞాని, రాజర్షి. యజ్ఞం కోసం చదును చేయడానికి భూమిని దున్నిస్తున్నాడు. నాగలి చాలుకు ఖణేల్మని పెట్టె తగిలింది. పెట్టెను తీసి అందులో ముద్దులు మూట గట్టే బంగారుపాపను జనకుడు తనకు భూదేవి ప్రసాదించిన కుమార్తెగా ఎత్తుకొన్నాడు.

నాగేటిచాలుకు సీత అని పేరు. నాగలి చాలుకు దొరికినందు వల్ల ఆ పిల్ల 'సీత' అనీ, జనకుని కుమార్తె కనుక 'జానకి' అనీ భూమిలో దొరికినందువల్ల 'భూజాత' అనీ పిలువబడుతూ అల్లారుముద్దుగా పెరిగింది.

సీత తోటి పిల్ల స్నేహితురాండ్రతో ఆడుతూ, బంతిని వెతుకుతూ పూలతో పూజింపబడి ఉన్న పెద్ద ధనుస్సును బెండు ఎత్తినట్లుగా ఎడమచేత్తో ఎత్తి దాని చాటున వున్న బంతిని తీసుకుంది. తర్వాత ఆ ధనుస్సు ఆటకు బాగుందని అవలీలగా తీసుకువచ్చి బొమ్మరింటి గోడలాగ పెట్టి, ఆట సాగించింది.

జనకుడు కళ్ళారా అదంతా చూసి నిర్విణ్ణుడైపోయాడు.

ఆ ధనుస్సు జనకుని పూర్వీకులు శివుడి దగ్గిర్నుంచి పుచ్చుకొని పూజిస్తూ వచ్చారు. త్రిపురాసుర సంహారంలో శివుడు ఆ వింటితోనే యుద్ధంచేశాడు. ఆ శివధనువును ఎత్తాలంటే బలాఢ్యులైన వారు మూడు వందలమంది ఉంటేనే గాని సాధ్యపడదు.

అలాంటి వింటిని ఎత్తిన సీత సామాన్యురాలు కాదనీ, ఆ శివధనుస్సును ఎత్తి ఎక్కుపెట్టగల వాడు మాత్రమే సీతకు తగ్గ వరుడనీ జనకుడు అనుకున్నాడు.

సీతకు స్వయంవరం జరిపినప్పుడు ముందు ఆ విషయాన్నే చాటిచెప్పి, అటువంటి వాడికే యిచ్చి కళ్యాణం జరపాలని నిశ్చయం చేసుకున్నాడు.

సీత మిథిలానగరంలో అలాగే పెరిగి పెద్దదైంది.

విశ్వామిత్రుడు యాగరక్షణకు రామ లక్ష్మణులను పంపమని దశరథుణ్ణి అడిగాడు. అందుకు దశరథుడు, "రాక్షసుల నుండి యాగరక్షణకు పసివాళ్ళను ఎలాగ పంపమంటావు, మహర్షీ! వాళ్ళు, అస్త్రవిద్యలు యింకా నేర్చుకో వలసిన వాళ్ళు!" అన్నాడు.

"అందుకేగదా నేను వచ్చినది! రాచబిడ్డలకు ఏ విద్య కావాలో నాకు తెలుసు. ఆ విద్య నేను నేర్పుతాను!" అంటూ విశ్వామిత్రుడు వసిష్ఠుడిని సగర్వంగా చూశాడు.



వసిష్ఠుడు చిరునవ్వుతో విశ్వామిత్రుణ్ణి మెచ్చుకొని, రామలక్ష్మణుల్ని, అతనితో పంపమని దశరథుడితో చెప్పాడు.

రామలక్ష్మణులు మునులకు మల్లే జుత్తు ముళ్ళు వేసుకొని విశ్వామిత్రుడి వెంట ధనుర్బాణాలు ధరించి బయలుదేరారు.

దారిపొడవునా విశ్వామిత్రుడు వారికి ధనుర్విద్యా విశేషాలు బోధిస్తూ సిద్ధాశ్రమానికి తీసుకెళ్ళాడు.

రామలక్ష్మణులు విశ్వామిత్రుని సునిశిత శిక్షణలో ధనుర్విద్యాపారంగతులయ్యారు. విశ్వామిత్రుడు ఋషులతో కలిసి యాగం మొదలుపెట్టడానికి ఏర్పాట్లు చేస్తూండగా భయంకరంగా అరుచుకుంటూ తాటక పిడుగులాగ ఆశ్రమం మీద పడింది.

విశ్వామిత్రుడు తాటకను చంపమని రాముడికి ఆనతిచ్చాడు. రాముడు తాటకపై శరపరంపర కురిపించాడు. ఒంటి నిండా దట్టంగా బాణాలు గుచ్చుకొని తాటక పెద్ద పర్వతంలాగ భూమిమీద పడి విల విలా తన్నుకొని ప్రాణాలు విడిచింది.

విశ్వామిత్రుడు రాముణ్ణి, అతని బాణ ప్రయోగ కౌశలానికి మెచ్చుకొన్నాడు.

యాగం ప్రారంభమయింది. విశ్వామిత్రుడు రాముడికి అస్త్రాల్ని ఉపదేశించాడు. రామలక్ష్మణులు ధనుర్ధరులై తిరుగుతూ యాగరక్షణ చేస్తున్నారు.



మారీచుడు, సుబాహుడు ఒక్కుమ్మడిగా విరుచుకు పడ్డారు. రాముడు రెండే బాణాలు విడిచాడు. సుబాహుడు చచ్చాడు. మారీచుడు బాణం దెబ్బతిని కొనప్రాణాలతో సముద్రంలో పడి కొట్టుకుపోతూ ఎలాగో లంక చేరాడు.

యాగం నిర్విఘ్నంగా సాగింది. విశ్వామిత్రుడు యాగసమాప్తిలో రాముడి చేత హవిస్సులు వేయించి హోమం చేయించాడు. యజ్ఞకుండం జ్వాలలపై తేలుతూ అర్ధచంద్రాకారం మొనగల ఒక బాణం దివ్యకాంతులీనుతూ వచ్చింది.

విశ్వామిత్రుడు, "రామా! అది నీ బాణం. 'రామబాణం' అని పేరొందుతుంది. శత్రువు కంఠం నరికి తిరిగి నీ చేతికి వస్తుంది!" అని చెప్పి బాణాన్ని రాముడికి అందించాడు. రాముడు బాణాన్ని కళ్ళకు అద్దుకొని పొదిలో పెట్టుకొని విశ్వామిత్రుడి పాదాలకు ప్రణమిల్లాడు.

యాగం చాలా కాలంగా సాగింది. ఆ కాలంలోనే విశ్వామిత్రుడు రాముడికి మహాస్త్రాలన్నీ ఉపదేశించాడు.

"రామా! నేనూ, నువ్వూ సూర్యవంశం వాళ్ళం. నాకు తెలిసిన అస్త్రవిద్యనంతా నీకు ఉపదేశించి నందుకు నా కెంతో తృప్తిగా ఉంది. నీలాంటి వాడికి గురువు ననిపించు కుంటున్నందు కెంతో ఆనందంగా ఉంది!" అన్నాడు విశ్వామిత్రుడు.

"గురుదేవా! నీ కృపకు పాత్రుడనైన నేను ధన్యుణ్ణి!" అన్నాడు రాముడు.

విశ్వామిత్రుడి సిద్ధాశ్రమంలోనే రాముడు, లక్ష్మణుడు యౌవనవంతులయ్యారు.

ఒకనాడు అస్త్రాలప్రయోగ విశేషాంశాలు చెప్తూ విశ్వామిత్రుడు, రాముణ్ణి తనివితీరా చూస్తూ, "రామా! నీ విశాల నయనారవిందాలు శాంతిచంద్రికలు వెదజల్లుతూ, నా ఆశ్రమాన్ని శాంతినిలయంగా చేయగా నీవు శాంతరాముడివి; సుందర రాముడివి!" అన్నాడు.




తన వెంట రమ్మన్నట్టుగా విశ్వామిత్రుడు బయలుదేరాడు. రామలక్ష్మణులు అనుసరిస్తున్నారు. విశ్వామిత్రుడు మిథిలానగరం దారి పట్టాడు.

దారిలో గౌతమాశ్రమం మీదుగా వెళ్తూండగా, రాముడి పాదం తగిలి ఒక బండరాయి అహల్యగా మారి రాముడి పాదాలకు ప్రణమిల్లింది. రాముడు ఆశ్చర్యంతో వెనక్కు జరిగాడు.



అదే సమయానికి చిరకాలంగా చేస్తూన్న తపస్సు చాలించి గౌతమ మహర్షి వచ్చాడు.

రాముణ్ణి భక్తిగా చూస్తూ, "రామచంద్రా! నా భార్య శాపంతీరింది. నీవు పావనరాముడివి!" అన్నాడు.

గడువు తీరి అహల్య శాపవిమోచనం జరిగింది. తనలో ఏముందని? అన్నట్లుగా రాముడు అయోమయంగా చూశాడు.

గౌతముడు తదేకంగా రాముణ్ణి చూసి, "ఔను, రామా! నీవు నివురుగప్పిన నిప్పువు! మాయా మానుషవిగ్రహుడివి!" అన్నాడు.

విశ్వామిత్రుడు ఔను! అన్నట్టుగా తలపంకించాడు.

"విష్ణువు అవతారాల్లో రామావతారం తర్వాత కృష్ణావతారంలో, కృష్ణుడు తాను అవతారమూర్తిగా తెలిసే అనేక లీలలు చేసి, మాయామానుష విగ్రహుడు అనిపించుకున్నాడు. రాముడు పరిపూర్ణ మానవుడిగా కర్తవ్యపాలన చేశాడు, మనిషిలాగే సాధించాడు. అదే రామావతార విశేషం!" అని సూతుడు వివరించి రామకథను సాగించాడు.

గౌతముడు అందర్నీ ఆశ్రమంలోకి తీసుకెళ్ళి, అతిథిసత్కారాలు చేశాడు. విశ్వామిత్రుడు గౌతమాశ్రమం నుండి రామలక్ష్మణులతో బయలుదేరాడు.

దూరంగా కోలాహలం వినిపించింది.

జనకమహారాజు సీతాస్వయంవర మహోత్సవానికి మహర్షులందరికీ భక్తిపూర్వకమైన తన ఆహ్వానం అందించి



రమ్మని, తన పురోహితుడైన శతానందుణ్ణి పంపించాడు. శతానందుడు అహల్యా గౌతముల కుమారుడు. శతానందుడి పల్లకి వెనక మిథిలారాజ్య లాంఛనాలతో పరివారం వస్తున్నారు. శతానందుడు విశ్వామిత్రుణ్ణి దర్శించడానికి సిద్ధాశ్రమానికి వెళ్తున్నాడు.

దారిలోనే ఎదురైన విశ్వామిత్రుణ్ణి చూసి, శతానందుడు దిగి ప్రణామం చేసి జనకుడి ఆహ్వానం విన్నవించాడు.

విశ్వామిత్రుడి వలన అహల్యా శాప విమోచన వృత్తాంతం విని శతానందుడు మహదానందంతో రాముణ్ణి శతవిధాల కీర్తించి, జననీజనకుల దగ్గిరికి వెళ్ళాడు.

రామలక్ష్మణ విశ్వామిత్రులు మిథిలకు చేరారు.

సీత, ఉద్యానవనంలో విహరిస్తున్నది. ఆమెతో చెల్లెలైన ఊర్మిళ ఉన్నది.

ఆ ఉద్యానవనంలో నుంచి విశ్వామిత్రుడు రామలక్ష్మణులు వెళ్తున్నారు. సీత, రాముడు ఒకర్నొకరు చూసుకున్నారు. 'తనవాడు వచ్చాడు!' అనే ఆనందంతో అడుగులు తడబడుతూండగా, సీత అంతఃపుర మందిరంలోకి పరుగుతీసింది. ఊర్మిళ మనస్సు లక్ష్మణుడిపై లగ్నమైంది.

రాజాధిరాజులు, బలసంపన్నులు ఎవ్వరూ శివధనుస్సును ఎత్తలేకపోయారు.

జనకుడు నిరాశపడుతూంటే, తండ్రి చెంత ఉన్న సీత, దూరాన ఉన్న రాముడిని ఓరచూపులతో చూస్తూ, ఉత్సాహంగా తండ్రి వంక రాముణ్ణి చూడుమన్నట్లుగా చూసింది.

విశ్వామిత్రుడు రాముణ్ణి ముందుకు పంపాడు. ఆచార్యదేవుడి ఆదేశం శిరసావహించి తాను నిమిత్తమాత్రుణ్ణి అన్నట్లుగా వెళ్ళి, శివధనుస్సుకు నమస్కరించి, రాముడు గున్నఏనుగు చెరుకు లాగినట్లు శివధనుస్సును అవలీలగా ఎత్తిపట్టి, నారిని బలంగా లాగి ఎక్కుపెట్టే




సరికి, గొప్ప ధ్వనితో భూనభోంతరాళాలు దద్దరిల్లగా, శివధనుస్సు విరిగిపోయింది.

ఆ మహాధ్వని తరంగాలు దిగంతాలు వ్యాపించి, దక్షిణ మహాసముద్రంలో మహేంద్ర పర్వతం మీద తపస్సులో ఉన్న పరశురాముడి చెవినిసోకాయి.

పరశురాముడు విష్ణువు మారురూపమైన గోలోకవాసియైన కృష్ణుడు చెప్పిన మాటలు గుర్తుకు తెచ్చుకున్నాడు. కృష్ణుడు యిచ్చిన కోదండాన్ని, విష్ణు అంశను రాముడికి అప్పగించడానికి బయల్దేరాడు.

సీత రాముడి మెడలో మాలవేసి సిగ్గు దొంతరలతో చరచరా తండ్రి చెంత చేరింది. సీతారాముల వివాహానికి దశరథుడు సకుటుంబ సపరివారంగా మిథిలకు చేరాడు.

పెళ్ళిపీటలపై సీతారాములు తలంబ్రాలు పోసుకుంటున్నప్పుడు, సీత కమలం వంటి దోసిట్లో ముత్యాలు పద్మరాగాల్లా ప్రకాశించాయి. రాముడి తలపై జాజిమల్లెల్లాగ తెల్లగా విరిశాయి. రాముడి శ్యామలశరీరంపై జారుతూ, ఇంద్రనీలాల్లాగ కనిపించాయి.

సీతకు చెల్లెళ్ళయిన ఊర్మిళను లక్ష్మణుడికీ, మాండవిని భరతుడికీ, శతరూపను శత్రుఘ్నుడికీ యిచ్చి వివాహం సీతారామ కళ్యాణమహోత్సవంలోనే జరిపించారు.

దశరథుడు కొడుకులు కోడళ్ళతో అయోధ్యకు తిరుగుప్రయాణమయ్యాడు. హటాహుటిగా వస్తున్న పరశురాముణ్ణి చూస్తూనే రథం దిగి ప్రణమిల్లి రాముడికి బదులుగా తన తల నరకమని ప్రాధేయపడ్డాడు.

పరశురాముడు, "ఓ, రామా! ఆ హర విల్లు విరిచావుట, ఈ వింటిని ఎక్కుపెట్టు!" అని తన చేతనున్న కోదండాన్ని అందించాడు. దాన్ని అందుకుంటున్నప్పుడే పరశురాముడిలోని విష్ణుఅంశ రాముడికి చేరింది. కోదండాన్ని రాముడు ఎక్కుపెట్టాడు.





# దుష్టులూ-నీతివంతుడూ

పరిష్యాదేశంలోని ఒక నగరంలో అబూ తమ్మామ్ అనే వర్తకుడొకడుండేవాడు. అతడు గొప్ప వాక్చాతుర్యం కలవాడేకాక, మంచి నిజాయితీపరుడు. ఆ కారణం వల్ల, అతడు వర్తకంలో చాలా ధనం ఆర్జించాడు.

ఆ నగరాన్నేలే రాజుకు అబూ పలుకుబడీ, సంపదా చూసి ఈర్ష్య కలిగింది. ఇక అక్కడ వుండడం క్షేమం కాదనుకుని, అబూ పొరుగున అల్యాన్ షా అనే రాజు పాలిస్తున్న దేశ ప్రధానపట్టణానికి వలస పోయాడు. ఈ అల్యాన్ షా యువకుడు, ధర్మవర్తనుడన్న పేరుపొందినవాడు.

ఆయన, అబూ గురించి విని, అతణ్ణి చూడగోరుతున్నట్టు కబురు పంపాడు. అబూ విలువైన కానుకలతో రాజును దర్శించి, తన వినయప్రవర్తనతో, చతురోక్తులతో ఆయనను ఆనందపరిచాడు. రాజు అతణ్ణి, రోజూ తన దర్బారుకు రావలసిందిగా కోరాడు.

అబూ వినయంగా తలవంచి, ''ప్రభూ, కొంత దూరాన వుండి, తమ సేవ చేయదలిచాను. ఎప్పుడూ రాజు వెంట వుండడం అంత క్షేమం కాదు. అది ఇతరులలో ఈర్ష్యకు కారణం అవుతుంది,'' అన్నాడు.

కాని, రాజు ఆ మాటలను అంతగా పట్టించుకోలేదు. ఏదైనా సమస్య వచ్చినప్పుడు ఆయన తన ముగ్గురు వజీర్లతో కాక, అబూతో సంప్రతించడం ప్రారంభించాడు. ఇది, వజీర్లకు కోపకారణమయింది.

ఒక రోజు వజీర్లు ముగ్గురూ కలుసుకున్నప్పుడు, వాళ్ళల్లో ఒకడు, ''ఈ అబూ, రాజును వలలో వేసుకున్నాడు. ఇప్పుడేం చేయడం?'' అన్నాడు.



వజీర్లూ ఒప్పుకున్నారు. ఆ తరవాత వాళ్ళు, రాజు ఎదట టర్కీ రాజకుమార్తె సౌందర్యాన్ని గురించి చిలవలూ, పలవలూ అల్లి చెప్పసాగారు. ఇలా కొన్ని రోజులు గడిచాక రాజుకు ఆమె పట్ల కొంత ఆసక్తి కలిగింది.

"అంతా బాగానే వున్నది. కాని టర్కీ రాజు దగ్గిరకు ఎవర్ని రాయబారిగా పంపేట్టు?" అన్నాడు రాజు.

"ప్రభూ, ఈ పని సానుకూలం కావడం, అక్కడికి వెళ్ళే రాయబారి తెలివితేటల మీద ఆధారపడివుంటుంది. అతడు ముందు టర్కీరాజును మెప్పించగలగాలి. ఇందుకు, ఎంతో బుద్ధిచాతుర్యంతో పాటు, రాచమర్యాదలు క్షుణ్ణంగా తెలిసివుండాలి," అన్నాడొక వజీరు.

"ఆ మాట నిజం. ఈ యోగ్యతలున్నవాడు, అబూతమ్మామ్ ఒక్కడే!" అన్నాడు మరొక వజీరు.

అందుకు మరొక వజీరు, "వాడి అంతం చూసేందుకు మార్గం ఒకటున్నది. టర్కీరాజు కూతురు అప్సరసలాంటి అందగత్తె అని మనం విన్నాంకదా! చాలా మంది రాజులు, ఆ అమ్మాయిని వివాహమాడేందుకు రాయబారుల్ని పంపారు. కాని, వాళ్ళల్లో ఒక్కడూ తిరిగిరాలేదు. బహుశా టర్కీరాజు వాళ్ళను చంపించివుంటాడు. మన రాజు యింకా బ్రహ్మచారి. మనం ఆ రాజకుమార్తె అందచందాలను గురించి ఆయనకు చెప్పి, రాయబారిగా అబూనుపంపమందాం," అన్నాడు.

అబూను తుదముట్టించేందుకు యిది తిరుగులేని పథకం అని మిగతా యిద్దరు

రాజు, అబూను పెళ్ళిరాయబారం పనిమీద టర్కీరాజు వద్దకు పంపాడు. టర్కీరాజు, అతడికి తగిన మర్యాదలు చేసి, "సరే, వెళ్ళి నా కుమార్తెను చూడు," అన్నాడు.

సేవకులు అబూను రాజకుమార్తె వుండే భవనానికి తీసుకుపోయారు. అతడు, ఆమెకు నమస్కరిస్తూ, ఒకే ఒక





సారి. తేరిపార చూసి, అక్కడి తివాసీ మీద తలవంచుకు కూర్చున్నాడు.

ఆ విధంగా నాలుగైదు క్షణాలు గడిచాక, రాజకుమార్తె అబూతో, "అక్కడ వుంచిన బహుమతులు, నీకోసమే," అంటూ దాపులనున్న ఒక వెండి పళ్ళాన్ని చూపింది. అందులో విలువైన బంగారు నగలున్నవి.

రాజకుమార్తె అక్కడినుంచి వెళ్ళిపోయింది. తరవాత అబూ వెళ్ళి రాజును దర్శించినప్పుడు ఆయన, "మా అమ్మాయి, నువ్వు గుడ్డి, చెవిటి, మూగవాడివని చెప్పింది! సంగతేమిటి?" అని అడిగాడు.

"ప్రభూ, మా రాజుగారు, తాను మీ కుమార్తెను వివాహమాడదలచినట్టు తమకు విన్నవించమన్నాడు తప్ప, ఆమెను నఖశిఖపర్యంతం పరిశీలించి చూడమని చెప్పలేదు. ఆవిడకేసి తలఎత్తి చూస్తూండడం మర్యాద అనిపించుకోదు. ఆమె మాట్లాడినదంతా విన్నాను, అయితే జవాబు తమకు విన్నవించుకుంటున్నాను," అన్నాడు అబూ.

"బాగానేవుంది, మరి బహుమతులు తీసుకునేందుకు నిరాకరించావెందుకు?" అని టర్కీరాజు అడిగాడు.

"మా రాజుగారి కోర్కెను తమరు అంగీకరించారో లేదో ముందుగా తెలుసుకోకుండా, బహుమతులు తీసుకోవడం తగిన పద్ధతికాదు," అన్నాడు అబూ.



అబూ జవాబు వింటూనే రాజు సంతోషంతో, "లోగడ వచ్చిన రాయబారులందరూ, నా కుమార్తెను చూస్తూనే తాము వచ్చిన పని మరిచి, అర్థంలేని వాచాలత ప్రదర్శించేవాళ్ళు. బహుమతుల్ని బిచ్చగాళ్ళలా చప్పున తీసుకుని, దుస్తుల్లో దాచుకునేవాళ్ళు. ఆ కారణంగా, వాళ్లకు పట్టిన దురవస్థ ఏమిటో చూడు!" అంటూ గది కిటికీరెక్కలు తెరిచాడు.

దిగువనున్న ఒక పెద్ద ఖాళీ జాగాలో ఖైదీలైన ఇతర రాజుల రాయబారులు అబూకు కనిపించారు.



"నా కుమార్తెను, మీ రాజు కివ్వడానికి నాకెలాంటి అభ్యంతరమూలేదు. ఇక, ఆమె యిచ్చిన బహుమతుల్ని నువ్వు సంతోషంగా తీసుకోవచ్చు." అన్నాడు టర్కీరాజు.

నెల తిరక్కుండానే టర్కీరాజ కుమార్తెతో, అల్యాన్ షా వివాహం జరిగిపోయింది. ఆ శుభసమయంలో, లోగడ తాను ఖైదు చేసిన రాయబారులను టర్కీరాజు బంధ విముక్తుల్ని చేశాడు.

అబూ తమ్మామ్ రాయబారం సఫలం కావడం చూసి, ముగ్గురు వజీరులూ ద్వేషంతో కుమిలిపోసాగారు. వాళ్ళు, అబూను నాశనం చేసేందుకు మరొక దుష్టపథకం ఆలోచించి, ఆ పని రాజు గారికి రాత్రివేళల్లో కాళ్ళుపట్టే, యిద్దరు కుర్రవాళ్ళకు వప్పగించారు. ఏం చేయాలో వాళ్ళకు చెప్పి, వజీర్లు లంచంగా వాళ్ళకు ఒక సంచీడు బంగారు నాణాలు యిచ్చారు.

ఒక రాత్రివేళ కుర్రవాళ్ళిద్దరూ రాజు గారి కాళ్ళు పడుతూ, ఆయన కళ్ళు మూసుకుని వుండగా, తాము ఆయన నిద్రపోతున్నట్టు పొరబడినట్టుగా సంభాషణ ప్రారంభించారు.

వాళ్ళల్లో ఒకడు, "ఆ వంచకుడి ప్రగల్భాలు విన్నావా?" అన్నాడు.

రెండవవాడు, "ఏ వంచకుడు?" అని అడిగాడు.

"ఉన్నవాడు ఒకే వంచకుడు—వాడే అబూ తమ్మామ్! రాజుగారికి తప్ప మిగతా అందరికీ వాడు పెద్ద మోసకారి అని తెలుసు," అన్నాడు మొదటి కుర్రాడు.

"ఏమిటా ప్రగల్భాలు?" అని అడిగాడు రెండవవాడు.

"ఆ టర్కీరాజు, తన బుద్ధిచాతుర్యం కారణంగానే, తన కుమార్తెను మన రాజుగారి కివ్వడానికి అంగీకరించాడట! అంతేకాక, రాజకుమార్తెకూడా, అత డంటే ఎంతో యిష్టమట!" అన్నాడు మొదటివాడు.

"అలాగా! ఈ అబూ తమ్మామ్ దుష్టుడని చాలామందికి తెలిసినట్టే, నాకూ తెలుసు. కాని, వాడింత పెద్ద దుష్టుడని మాత్రం నేననుమానించలేదు," అన్నాడు రెండోవాడు.

రాజు మేల్కొనే వుండడంతో, తన సేవకుల సంభాషణ విన్నాడు. ఆయన తెల్లవారుతూనే మొదట చేసిన పనేమిటంటే, అబూను ఖైదులో వేయించడం.

కొద్ది దినాలు గడిచాక, ఒకనాటి రాత్రి రాజుకు ఎవరో యిద్దరు నౌకర్లు పోట్లాడుకుంటూ పెట్టే కేకలు విని, నిద్రాభంగమయింది. ఆయన గదినుంచి బయటికి వచ్చి నిశ్శబ్దంగా నౌకర్లు నివసించే ప్రదేశానికి వెళ్ళాడు. అక్కడ తనకు కాళ్ళు పట్టే కుర్రవాళ్ళిద్దరూ కేకలు పెడుతూ, కుమ్ములాడుకుంటున్నారు.

"నాకు, ఆ బంగారు నాణాల్లో మూడు వంతులు కావాలి. ఆ రాత్రి నీ కంటే నేనే ఎక్కువ మాట్లాడాను," అంటున్నాడొకడు.

రెండోవాడు అందుకు అంగీకరించక, మొదటివాడికి ముష్టిఘాతాలిస్తున్నాడు. రాజు తన అంగరక్షకులను పిలిచి, వాళ్ళను తన గదికి లాక్కురమ్మని ఆజ్ఞాపించాడు. అక్కడ వాళ్ళిద్దరూ తమ కొట్లాటకు కారణం చెప్పి, వజీర్లు ముగ్గురూ తమకు బంగారం ఆశ చూపి, ఏం చేయాలో నేర్పినందువల్లనే, ఆ రాత్రి అబూ తమ్మామ్ గురించి అబద్ధాలు పలికామని ఒప్పుకున్నారు.

రాజు అప్పటికప్పుడే అబూ తమ్మామ్‌ను ఖైదునుంచి విడిపించి, అతడికి జరిగిన దానికి క్షమాపణ చెప్పుకున్నాడు.

"ప్రభూ, లోగడే మనవి చేశాగదా— తమకు సమీపంలో వుండడం, నాకు ప్రమాదకారణం అవుతుందని!" అన్నాడు అబూ చిరునవ్వు నవ్వుతూ.

రాజు సంతోషంగా తలాడించి, దుష్టులైన ముగ్గురు వజీర్లనూ తగు విధంగా శిక్షించి, అబూను తన ప్రధానవజీరుగా నియమించుకున్నాడు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1984 జనవరి నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan



P. Sundaram

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ నవంబరు నెల 15 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/—లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: — చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### సెప్టెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: విద్యాబుద్ధుల నియ్యి — రెండవ ఫోటో: లేచి నాట్యం చెయ్యి

పంపినవారు: డి. వి. అలివేలుమంగాదేవి, శ్రీనగర్, విజయవాడ

*బహుమతి మొత్తం రు. 50/—నెలాఖరులోగా పంపబడుతుంది.*

### మీకు తెలుసా? సమాధానాలు:

1. సగటు మానవశరీరంలో యాభైవేల మైళ్ళ పొడవు రక్తనాళాలు వుంటాయి. 2. పదిహేడు వేల రంగులను గుర్తించగలదు. 3. పదివేల వాసనలను గుర్తుపట్టగలదు. 4. ఆంగ్లభాష; దాదాపు ఎనిమిది లక్షల పదాలు వున్నాయి. 5. లియొనార్డో డా విన్సీ.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

ఎండలో ఆట, ఇసుకలో ఆట
బంతితో ఆట, ఆడే ఆట
కెరటాలు కూడా పారిపోవునిక
జెమ్స్ తింటాం మరి అందరం యిక!








**చేజిక్కించుకోండి ఆ మధుర క్షణాల్ని**
**చేజిక్కించుకోండి ఆ జెమ్స్‌ని !**

క్యాడ్‌బరిస్
చాక్లెట్లు

పువ్వులన్నీ సుగంధాన్ని పంచుతాయి, క్యాడ్‌బరిస్ జెమ్స్ తియ్యదనాల్ని అందిస్తాయి.

OBM-9680-TL

## చందాదారులకు గమనిక

'చందమామ' కాపీలు పంపుటకు మీ చిరునామాలో ఏదైనా మార్పుంటే 5-వ తేది లోగానే, మీ చందా నంబరు ఉదహరిస్తూ మాకు తెలపాలి, ఆలస్యమైతే మళ్ళీ నెల వరకు మీ క్రొత్త అడ్రసును అమలు పెట్టడానికి వీలుండదు.

డాల్టన్ ఏజన్సీస్
'చందమామ బిల్డింగ్స్'
మదరాసు - 26

'KITTOO IS A CYCLING CHAMPION EVERY ONE ADMIRES HIM. HE WINS EVERY POSSIBLE RACE.



HE HAS WON MANY PRIZES IN CYCLING CHAMPIONSHIPS.



KITTO TELLS US THE STORY OF HIS SUCCESS.







MY CYCLE WAS ADMIRED BY ALL THE FRIENDS AND EVERYONE WANTED A TOBU CYCLE.



SOON EVERYBODY GOT A TOBU CYCLE FOR HIMSELF AND WE HAD CYCLE RACES DAILY.



RIDING ON TOBU CYCLES WAS A PART OF MY CHILDHOOD. I PEDALLED DIFFERENT MODELS OF DIFFERENT COLOURS AS I GREW UP.



TOBU GAVE ME CONFIDENCE AND A SPIRIT OF COMPETITION.



SMALL THINGS MATTER A LOT IN CHILDHOOD.




IS ONE OF THEM

SUPERB

# పాపాయికి లాలీ-పాప్
# పారీసే అందించే లాలీ-పాప్!




## లాలీ-పాప్
### భలే రుచి

PCL-1273